# బాపనపిల్ల

Bha. pa na. pilla.

వేలూరి శివరామశాస్త్రి

# బాపనపిల్ల

పొద్దు వాలబోతూవుంది. పేరమ్మ పెత్తనాలు చాలించి ఇంటి మొహం పెట్టింది. ఆమె ముందు పది పన్నెండేండ్ల పిల్ల ఒకత్తె నడుస్తూంది. ఆపిల్ల ఆమె మనమరాలు. పల్లెటూరి ఇరుకుదారిలో ఈతలపక్క కట్టేసిన మేకపిల్ల ఒకటి ఆతలపక్కకు పోయి పడుకుంది. అది కంటపడంగానే పేరమ్మ పెద్ద గొంతుక పెట్టుకుని—'ఒసే అమ్మో! తాడు దాటబోకు! దాటావూ? ఛండాలం రాలా! కళ్లు నెత్తిమీద పెట్టుకుని నడుస్తున్నావా? కళ్లు పోయినయ్యా? కట్టిన మేకపిల్ల కళ్లయెదుట సాక్షిగా అల్లా కనబడుతూంటే!' అని అరిచింది.

'మేకపిల్ల నిద్రపోతూంది నాయనమ్మా' అని మనమరాలంది.

'నిద్రగోతూందీ! నిద్రపోతే దోషం పోతుందా? నీ వీ మంగళార పొద్దు సాక్షిగా కట్టుతాడు దాటావూ?'

'దాటితే యేం నాయనమ్మా?'

'ఏమా? పాడుమొహామా? బాపనింట పుట్టలేదూ? పదేళ్లు దాటొచ్చాయ్, ఏళ్లకు పెద్ద! బుద్ధికి గాడిద! శుద్ధ మొద్దు. కట్టుతాడు దాటరాదనీ తొక్కరాదనీ తెలియదూ? పైగా దాటితే ఏం?' అని ప్రశ్నా? ఓయి

దేవుడా! చెప్పరానివాళ్లందరూ మేపుకోవాలనే ఆత్రంతో నలుగురూ తిరిగే దారిలో మేకలను అడ్డంగా కట్టడమా? ఆc? ఈ మంగళవారపు మాపటిపొద్దు ఈపిల్ల తాడు దాటించి. నలుగురూ నడిచే దారిమీద మేకలం కట్టడమెందుకూ? వాళ్లకు పిల్లలూ పాపలూ లేరా అని అడుగుతా. తమకు మాత్రం మేలూ కీడూ కలుగుతుం దని తెలియదా అంట?'

పేరమ్మ దృష్టి అకస్మాత్తుగా ఒక ఉప్పరిపిల్లమీద పడ్డది. దానికి పన్నెండు పదమూడే ళ్లుంటయ్. మేకపిల్లను దారిలోంచి తియ్యడానికి అది బెదురుతూ బెదురుతూ వస్తూంది. అప్పుడు పేరమ్మ తనకు కనపడని వారిని వదిలిపెట్టి కనిపించిన ఈ పిల్లమీద పడి—'నీ వెవత్తెవే? ఏకంగా తాచుకునే పోతున్నావే? ఛావు! నీకు కళ్లులేవూ? చూపు కనబడదూ? నీ కొంగు మా పిల్లదానికేసి కొట్టావూ?'

'లేదండీ అమ్మగారూ! నే నాతలనుంచి ఎడంగా వచ్చానండీ!' అని భయంతో ఉప్పరపిల్ల ముద్దఅయిపోయింది.

పేరమ్మ తనమొహం చాలా వికారంగాపెట్టి—'ఆతలనుంచి ఎడంగా వెళ్లావా? నీ కాతలనుంచి పోవలసిన అవుసరం ఏముందీ? మేక నీదే కాబోసు! నీ దే కులమంట?' అని అన్నది.

'మే ముప్పర్లమమ్మా'

'ఏమీ ఉప్పర్లా? కానివేళలో నీవు మా అమ్మాయిని తాకి స్నానం చేయిస్తావ్?'

'నన్నది తాకలేదు నాన్నమ్మా' అని మనమరా లంది.

'ఛీ ధడవా! వూరుకో! దాని కొంగుఅంచు నీ ఒళ్లు రాసుకు పోతుంటే నేను కళ్లారాచూస్తే. ఈ సంఝూకాలంలో చెర్లో మునిగి ఛస్తు గాని పద. తలారా ములిగిమరీ యింట్లో కాలెట్టు! ఓయిదేవుడా జాతీ జన్మా [illegible]మూ ఉండేట్టులేదు. అలికీజాతికి అతిశయం హెచ్చయింది. దేవతలంటే

భయంలేదు, బ్రాహ్మలంటే అంతకన్నలేదు. ఛాండాలపుముండా! మేక పిల్లను కట్టేయడానికి ఉప్పరగూడెంలోంచి బాపన అగ్రహారంలోకి వొచ్చావా?'

ఈ మాటలతో ఆ ఉప్పరపిల్లభయానికీ చిన్నతనానికీ అంతూ పొంతూ లేకుండాపోయింది. అది మేకపిల్ల నెత్తుకుని 'అమ్మమ్మగారూ! నేనీ అమ్మాయిగార్ని అంటుకోలేదండీ!' అని మాత్రం చెప్పి ఊరుకుంది.

'నీ వంటుకోకపోతే మావీధికి ఛావడానికి వచ్చావా?'

ఉప్పరపిల్ల చేయెత్తి కనబడని ఒక దాపు యింటికేసి చూపి—'ఆ బాపనదొరగారు వారి పసులపాకలో ఒక పక్క స్థలమిచ్చిండ్రు. మాతాత, మా అమ్మనూ మరి గత్తే నన్నూ తన్ని తగిలేసిండుకదూ' అని అన్నది.

ఎవరికయితేనేం, ఏకారణంచేతనైతేనేం, ఒకరి కపకారం కలిగిందన్నమాట విని కుపితమయిన పేరమ్మహృదయం అతికష్టమ్మీద సంతోషం పొందింది. ఇంతేకాకుండా రుచికరమయిన ఈ వృత్తాంతం ఆద్యంతాలు తెలుసుకోవడాని కామెకు కుతూహలం కలిగింది. 'ఏమిటీ? నిజమే? నిన్నూ మీ అమ్మనీ తన్ని తగిలేశాడూ? ఎప్పుడు?' అని అడిగింది.

'అమ్మమ్మగారూ! రేత్తిరి రేత్తిరండి.'

'ఓ! నీవు సాగిగాడి కూతుర వనుకుంటా. అట్లా చెప్పు ముచ్చట! చావుబతుకుల్లో ఉన్న ముసలిముండాకొడుకు మిమ్మన్ని తన్నితగిలేశాడూ? అలికీజాతి, మొహం మండ. సరేకానీ, చోటు ఇచ్చారుకదా అని మీరు బాపన వీధిలో మకాం వేస్తారా? మీరుకూడా తక్కువవాళ్లు కారు. మీ అమ్మ నెవరు తీసుకొచ్చారు? రామావధానులవారి అల్లుడా యేమి? ఆయనకంటె ప్రబుద్ధు డెవడులే. ఇంటల్లుడ వింటల్లుడవు మాదిరిగానే ఉండు. మామగారి ఆస్తి వచ్చిపడ్డదిగదా' అని బ్రాహ్మణాగ్రహారం నట్ట నడుమ గవుండ్లవాళ్లనూ, మాలవాళ్లనూ, ఉప్పర్లనూ, దొమ్మర్లనూ తెచ్చి

చేయిస్తావా ? అని పేరమ్మ—‘సంధ్యా ! ఓసంధ్యా ! ఉన్నావా అంటూ?’ అని కేక పెట్టింది.

కొద్దిపాటి కాళీస్థలానికి ఆనింటూ రామావధానులుగారి గుమ్మం. ఆమె పిలుపువిని దగ్గరసా వున్న గుమ్మంతలుపులు తెరిచి పందొమ్మిది ఇరవై యేండ్ల నిండుయౌవనంలో ఉన్న ఒక చక్కని కన్య ముఖం బయటికి పెట్టి—‘ఎవరా పిలిచింది ? నీవటమ్మా అత్తా ? ఎందుకు ?’ అని అనుకుంటూ బయటికి వచ్చింది.

‘అమ్మాయీ! మీ నాన్నగారి తెలివితేటలు ఎటువంటివి చెప్మా? మీ తాతగారు రామావధానులుగారు ఎంత శిష్టాచార సంపన్నుడు, ఎంత పేరు మోగినవాడు? అట్టి ఆయన స్వగృహంలో పందులు తిరిగే ఉప్పరు కాపరమా? ఎంత సిగ్గుచేటమ్మా?’ అని పెదవిమీద ఒకసారి వేలు వేసుకుని మళ్లా ఇల్లా అందుకుంది —‘ఇదిగో మీ అమ్మ నోసారి పిలు! జగదాంబ దీని కేమయినా ప్రతిక్రియ చేస్తే సరేసరి, లేకుంటే శాస్తులుగారి దగ్గరికి స్వయంగా నేనువెళ్లి చెప్పి వస్తా. శాస్తులుగా రంటే జమీద్దారు. ఆయన పేరువల్లెరగరు? ఆయ నేమంటాడో ఒకసారి వింటాను.’

సంధ్య చాలా ఆశ్చర్యపడి ‘ఏమిటమ్మా అది?’ అని అడిగింది.

‘మీ అమ్మనొకసారి పిలుస్తూ; ఏమిటో ఆవిడెకు చెప్పిపోతాను’ అని మనమరాలిని చూపి ‘ఈపిల్ల మంగళవారపు మాపటిపొద్దు మేక కట్టుతాడు దాటింది, ఈ ఉప్పరిముండ దీన్ని కొంగేసి కొట్టింది’—

‘నీవు కొంగేసి కొట్టావుటే?’ అని సంధ్య ఉప్పరిపిల్ల నడిగింది.

పాపం ఆ పిల్ల మేకపిల్ల నెత్తుకుని దారి తప్పుకుని ఇంకా అక్కడే నిలబడి ఉంది. అది ఏడుపు మొహంతో ఒప్పుకోక, ‘లేదండీ అక్కయ్యగారూ’—

పేరమ్మ మనమరాలుకూడా ఇంచుమించుగా దాని మాటలతోటే

తన మాటలుకూడా ఇల్లా కలిపింది___ 'లేదు పిన్నీ! అది నన్ను తగల లేదు' అది అనింటూ___

నాయనమ్మగారి హుంకారంతో మనమరాలి మాట అంతటితో ఆగి ఊరుకుంది.

'ఈసారి మళ్ళా లేదనిచెప్పు చూడాలురాలా. ముం దింటికి పదూ. ముట్టుకుందో లేదో అక్కడ చూపిస్తాను.'

'బలవంతంగా నీళ్లలో ముంచుతావుగాని అంతకంటె ఏం చేస్తా వమ్మా?' అని సంధ్య అంది.

ఈనవ్వుకు పేరమ్మ మండింది. బలవంతమో గిలవంతమో అది నా పనిగాని మీ నాయనగారి పని ఏం బాగుంది? స్వగృహంలో ఏ బ్రాహ్మడు అలికిజాతివాళ్లను వుండనిస్తాడు? అందులో ఉప్పర్లు. వాళ్లు అన్నానికి బదులు పందిని తింటారు. నీళ్లకు బదులు కల్లు తాగుతారు. అటువంటి ఉప్పర్లనుతెచ్చి బ్రాహ్మణవీధిలో పెడతాడా? ఇల్లటం అల్లుడు ఇల్లటం అల్లుడుగా ఉంటేనే బాగుంటుందంట.

తండ్రిని అవమానపరచే ఈమాటలకు సంధ్యమొహం కందింది. ఆమెకూడా కరుకుగానే ఇల్లా జవాబుచెప్పింది: 'మానాన్న ఇంకోళ్ళ ఇంట్లో అలికిజాతివాళ్ళను తీసుకొచ్చి పెట్టలేదం డత్తా! ఆయన బాగా ఆలోచించే తమ జాగాలోనే కాస్త చోటిచ్చారు. అందువల్ల మీకింత మంటెందుకు?'

'మీకింత మంటెందుకా? అయితే ఇహ ఎందుకో చూస్తువుగాని శాస్త్రుల్లు దగ్గిర కొకసారి వెళ్ళనా? వెళ్ళి చెప్పనా?'

'మంచిది. వెళ్ళి చెప్పుకోరాదూ? ఆయనగారు గొప్పవాడనిన్నీ తల తుంచివేస్తాడనిన్నీ మానాన్నగారు తమ జాగాలో ఉప్పర్లకు చోటిచ్చారు మహా'

'ఓహో పిట్ట కొంచెం కూత ఘనం. ఒసే ఆయన మరెవరూ కాదు, —కొండవళాస్త్రుల్లుగార్లు. ఇంతవరకూ మీనాయన కాయన సంగతి తెలిసి వట్లు లేదు. సరే మంచిది.'

ఈ గందరగోళం విని జగదంబ వచ్చింది. ఆమెను చూడంగానే పేరమ్మ అగ్గివలె భగ్గుమనిమండి పెద్దగొంతుకతో పేటంతా ఎగిరిపోయేటట్టు ఇట్లా అంది—'జగదాంబా! విన్నావా, నీకూతురు విద్యాధరి మాటలు. చదువుసందెలు చెప్పించావుకదూ! మహా చెప్పవో పో శాస్త్రుల్లతో మానాన్నతల అంతటితో పోతుందికాబోలు! ఉప్పర్లయితేం సొప్పర్లయితేం మాఇంట్లోనే పెట్టుకున్నాంగాని ఇంకెవరి యింట్లోనూ ప్రవేశపెట్ట లేదు. ఇటువంటివాళ్ళను చాలామందిని చూశాం, చేతనయిందేమిటో చేసుకో' అని అంటుంది. విను నీకూతురుమాట లొకసారి విను.

జగదంబ విస్తుపోయి 'నీ వీ మాటలన్నీ అన్నావా?' అని కోపంతో అడిగింది.

సంధ్య తల తిప్పి 'లేదు, నేనల్లా అనలేదు' అని అన్నది.

పేరమ్మ సంధ్యమొహంమీదనే చేతులుతిప్పి—'అనలేదూ? వీరందరూ వినలేదూ?' అని బిగ్గరగా గర్జించింది కాని మరు నిమిషంలోనే తన కంఠస్వరాన్ని అతి విచిత్రంగా షడ్జంలోంచి ఒక్కసారి మందరంలోకీ అనుమందరంలోకీ దింపి—'జగదాంబా! నేను మంచిమాటలే చెప్పానమ్మా! ఈ మంగళవారపు మాపటివేళ ఈపిల్ల మేక కట్టుతాడు దాటింది. అది చూసి: ఓసెమ్మా దారిలో ఈ మేకపిల్ల నెవరు కట్టేశారని అడిగాను. ఆమాట వినిపించుకోక ఈ ఉప్పరిపిల్ల పరుగెత్తుకొచ్చి మాఅమ్మాయి మొహంమీద కొంగేసి కొట్టింది. కొట్టి 'ఆ ధొరగారి జాగాలో మేకను కట్టేసుకుంటే వొద్దనడానికి నీ వెవ్వరు?' అని అంది. అందుమీద వెంటనే మా అమ్మాయిని పిలిచి, సరిగ్గా—ఈమాటలే 'అమ్మాయీ! అకాలంలో

దీన్ని ముంచాలిసొచ్చింది, ఆ కాలంలో కట్టుతాడు దాటింది, కాబట్టి మా వాన్న ఉప్పరిగూడెంనుంచి పీళ్లను తెచ్చి ఇంట్లో పెట్టుకుంటే, ఈ సీంక లనూ గీకలనూ కొంచెంచూచి ఎక్కడ కట్టేయించాలో అక్కడ కట్టేయిస్తే బాగుంటుంది. అలికీవాళ్ళ కాచార వ్యవహారా లేమీ తెలియవ్-శాస్తుర్లు పెద్దవాడు, ఈదారినే వస్తూపోతూ వుంటాడు. తాడూ గీడూ గనుక తొక్కితే ఆయనకు కోపంగీపం వస్తుంది.—జగదాంబా ఇవీ నే నన్న మాటలు, ఇంతే. ఈమాటలకే మీఅమ్మాయి నన్ను కొట్టకమాత్రం విడిచి పెట్టింది. 'పో పో మీ శాస్తుల్లును గీస్తుల్లునూ పిలుచుకురా! ఇటువంటి వాళ్ళ నెందరినో చూశాను. మాయింట్లో మేం ఉప్పరివాళ్ళకు తా విచ్చు కుంటే ఆయనెవరో వచ్చి కాసిస్తాట్ట!' అని అన్నది. జగదాంబా నీవే చెప్పు ఇవేనా అనాలిసిన మాటలు?

జగదంబ మండిపడి—'ఏమే నీ వీమాట లన్నీ అన్నావా?' అని అడిగింది.

సంధ్య ఇంతవరకూ విస్మయంతో మాట పెకలక పేరమ్మ మొహం కేసి చూస్తూవుంది. తల్లిమాట విని చకితురాలై మోము తిప్పి 'అనలేదు' అని మాత్రం అన్నది.

'అనలేదూ? అన్ని అబద్ధాలూ అత్తే కల్పించిందా?'

'అడుగమ్మా! నీకూతు ర్నింకోమా రడిగిచూడు.'

సంధ్య కొంచెంసేపు మెదలకుండా ఊరుకుని తల్లినిచూచి 'ఎవరి మాట లబద్ధాలో నా కెరుకలేదుగాని నీవు నీకడుపున పుట్టిన కూతురును నమ్మక ఈ దూరపు అత్తనే నమ్మితే ఈ అత్తమాటలే నిజంకావచ్చు' అని సమాధానంచెప్పి మళ్లా ప్రశ్నింపకముందే తెరచిన ద్వారంలోంచి వడివడిగా ఇంట్లోకి వెళిపోయింది. పేరమ్మ జగదంబా వీరిద్దరూ సంధ్య వెళ్లిన దారి కేసి కళ్లుపెట్లుకుని చూస్తూ నిలబడిపోయారు. పండెప్పుడు దొరుకుతుందా

ఎప్పుడు పోదామా అని కాచుకూర్చున్న ఉప్పరిపిల్ల మేకపిల్లతో జారింది.

'జగదాంబా నీకూతురెంతదో చూశావా? మాటలు విన్నావుకద! దూరపు అత్త అని అంటుంది. శిష్టాచారసంపన్నులయిన ఇంటివారి ఆడబడుచుకదూ? అందువల్ల అంటుందిలే. పెళ్లి అయివుంటే ఈపాటి కయిదారుగురు బిడ్డలతల్లి అయివుండేది. దూరపు అత్త, దూరపుఅత్త,—విన్నావ్ కద!'

జగదంబ కిమ్మన కూరుకుంది. పేరమ్మకూడా కాసేపల్లాగే ఊరకుండి హఠాత్తుగా ఇల్లా అనేసింది — 'జగదాంబా! వఝుల వారి పిల్లాణ్ణి మీ యింట్లోకి రానిస్తున్నారటగా? విన్నానులే. ఏమిటి? ఈమాట నిజమేనా అంట?'

జగదంబ ఈమాటలు విని లోలోపల చాలా భయపడ్డది.

పేరమ్మ మళ్లా ఇల్లా అనడం మొదలుపెట్టింది: నా కూతురున్నమ్మకూ ఆనాడు లడాయైపోయింది. ఏమన్నానా, మరెవరూ కాదు, అది జగదాంబ సుమీ! హరిశాస్త్రులవారి మనుమరాలు, రామావధాన్లవారి కూతురు. శూద్రులతో సమానులని నియోగుల గడప తొక్కదు. అటు వంటిది సీమకు వెళ్లివచ్చిన ఈ వాలాణ్ణి ఈ మ్లేచ్ఛుణ్ణి తన వంటిల్లు చూడనైనా చూడనిస్తుందా? లేనిపోనివి మీరిల్లా ఎందుకు అంటారు?' అని నేను పోట్లాడాను జగదాంబా!

తన హితం కోరే ఈ పేరమ్మప్రశ్నకు జగదంబ కొంచెం సిగ్గుపడి తెల్లరనవ్వునవ్వి—'అత్తా! నీవు సరిగ్గానే సమాధానం చెప్పావ్. కాని తెలుసునా, వఝులు చిన్నప్పటినుంచీ మాయింటికి వస్తూ పోతూ వుంటాడు. ఎరిగో ఎరక్కో నన్ను అత్తా అని పిలుస్తాడు. అందువల్ల రావద్దు అని నోరువిప్పి చెప్పలేకుండా వున్నాను. అతడూ తరుచు రాడు. ఎపుడో మట్టపుచూపుగా వస్తాడు. పాపం అతనికి తలిదండ్రులు లేరు. అతని

మొహంచూస్తే నామనస్సు నీరైపోతుంది. ఇదేం మాయో నాకు తెలియకుండా ఉంది.

పేరమ్మ మొదట మాట్లాడలేకపోయింది, పిదప క్రుద్ధస్వరంతో 'ఏ మాయ మందు' అని అన్నది.

పేరమ్మక్రోధం అకస్మాత్తుగా చివరిమెట్టెక్కింది, అవిడే ఆ క్రోధానికి తగినట్లుగా తన కంఠస్వరాన్ని కాపాడుకొని 'ఈపతితుణ్ణి ఈమాలాణ్ణి ఇంట్లో కూచోపెట్టుకుంటున్నారా? ఇటువంటి దురాచారు డీవూళ్లో మరొకడు లేడని నీకు తెలియజెపుతున్నాను, విను. శాస్త్రుర్లు జమీందారంతవాడు. అంతవాడు తాను స్వయంగా ఈ అభాగ్యుణ్ణి పిలిపించి—'ఒరే వర్షులూ! జీతనాతాలు లేకుండా చదువు చెప్పిస్తా రశే లోభం సముద్రంలో విడిచేసి ఇంటిక్రాద వింట్లో వుండిపో! సీమకు పోకు' అని చెప్పాడు. చెపితే ఈ అభాగ్యుడు విన్నాడా? అంతపెద్దవాడి మానమర్యాద లేమయినా ఉంచాడా? విపరీత ప్పిల్లాడు! సీమకు పోతూ ఎంత అపహాస్యంగా సమాధానం చెప్పా డనుకున్నావ్, విను—'సీమకు పోతే జాతి పోతుంది...పోతే పోయింది, పోవడం నాకు మేలే, కాని తాండవ శాస్త్రులుగారిలాగా మేకలనూ గొర్రెలనూ సీమకు పంపి డబ్బు చేసుకోవడం నాకక్కర్లేదు. సంఘంమీది కెక్కి వారి జాతీ వీరి జాతీ మంచిది కాదని ఛాతి విరుచుకుంటూ తిరగడమూ నా కక్కర్లేదు' ఇవీ వా డన్నమాటలు! జగదాంబా! నేనుగనుక అప్పుడక్కడ ఉంటే చీపురుకట్టతో అబ్బిగాడి మొహం చక్కజేసిఉండేదాన్ని. ఎక్కడ వర్షులు? ఎక్కడ తాండవ శాస్త్రులు? తాండవశాస్త్రులంటే తెలుసా? అన్నం తిని ఆవుపేడతో ముఖశుద్ధి చేసుకుంటాడు. అంతటివాడితోనా ఈ మాటలు?'

జగదంబ బహు ఆచి ఆచి ఇల్లా అంది—'వర్షు లెన్నడూ ఎవరినీ ఒక్కమాట అనడమ్మా'

'నేనే అబద్ధాలు చెప్పాను కాబోలు. తాండవశాస్త్రులే—'

'ఎబ్బె ఎబ్బె! ఆయ సెందు కాదతారు? అయితే లోకులు ఉన్నవీ లేనివీ కలిపి చెపుతుంటారు—'

'నీ దదేమాట జగదాంబా! లోకులకు అతనితో ఇహ పంక్తి భోజనాలు లేవుకదూ, అంచేత ఉన్నవీ లేనివీ కలిపించి చెప్పుచ్చురే. సరేకాని ఈ ప్రబుద్ధుడు సీమకు వెళ్లి ఏమి మహా దిగ్గజమై దిగాడా? ఏదవలేక ఎగసాయ మని ఎగసాయం నేర్చుకొచ్చాడు. నవ్వలేక చస్తాను. ద్రావిళ్లు కానీ నియోగ్యులే కానీ బ్రాహ్మల కుర్రాడుకదా! ఈదేశంలో ఎగసాయం చేసుకునే సంసారులు లేరూ? ఇహ ఇతగాడు నాగలీ బోగలీ బుజాన వేసుకుని పొలాలన్నీ తిరుగుతాడూ? ఇంతకంటె ఛావు వేరే వుందా?

పేరమ్మ కంఠస్వరపు తీవ్రసౌరభం క్రమంగా వ్యాపించడాని కారంభించిం దని పసిపట్టి, గ్రామపెద్దలు తేనెటీగల్లాగా ముసురుకుంటారనే భయంతో జగదంబ మెల్లమెల్లగా ఇల్లా అంది—'అత్తా నిల్చోని నిల్చోని కాళ్ళు తీపెటతయ్, కొంచెం ఇంట్లోకిపోయి కూచుని మాటా మంతీ చెప్పుకుందాం పద.'

'వద్దమ్మా వద్దు. పొద్దు వాలుతూంది. వెళ్లాలి. ఇంకా దీన్ని చెరువులో ముంచి తీసుకురావాలి. ఉప్పరిపిల్ల పారిపోయినట్టుందే చూస్తే'

'అవు నాయనమ్మా! మీరు మాటలు చెప్పుకుంటున్నారే అప్పుడు వెళ్లిపోయింది. కాని నన్నది తాకలేదు నాయనమ్మా!'

'మళ్లా లేదంటావ్ భడవా! ఇదిగో జగదాంబా! బతిమాలుకుని చెబుతున్నా విను. వీధిలోకి ఉప్పర్లను సాకర్లను తెచ్చి కెట్టకు! అల్లుడిగారితో కొంచెం చెప్పు. ఏం?'

'చెప్పడ మేమి టత్తా? రేపొద్దుస్నే కీళ్లను నేను వెళ్లగొట్టేసాను. వీళ్లిక్కడుంటే నూతిలో నీళ్లు తోడి పారబోస్తారు, మడిగుడ్డలతో మనమేం

ఆనీళ్ళు తొక్కుకుంటూ పోవాలి సొస్తుంది.'

'అట్లా చెప్పమ్మా అట్లా చెప్పు. నే నీ మాటలే అన్నానుకాని ఈ కాలపు పిల్లలకు ఈ మాటలు నచ్చుతయ్యా? ఆనాడు శాస్తుల్లు ఏమన్నాడో విన్నావా — 'పేరమ్మా పేరమ్మా! మన జగదాంబ కూతురికి చదువుసంధెలు చెప్పిస్తున్నాట్టగా తండ్రి! నిజమేనా? నిజమే అయితే వద్దని చెప్పు, వద్దని చెప్పు. ఆడపిల్ల చదువు సంధ్యలు నేరిస్తే నరకప్రాప్తి' అని అన్నాడు.

జగదంబ భీతికి హద్దూ పద్దూ లేకుండా పోయింది. 'శాస్తుల్లుమామ అన్నాడా! శాస్తుల్లుమామ అన్నాడా!! అని అన్నది.'

'అనడా మరి? ఆయన బ్రాహ్మణ్యానికంతా తలకాయాయె, గ్రామానికల్లా జమీందారాయె. ఆయన చెవిలోకి ఏమాట వెళ్ళదో చెప్పు. ఇటు మేంకూడా ముసలితనంలోకి పోతున్నాం,—చదువు చదువుకున్నానని చెప్పుకోనుగాని నాకు ఏశాస్త్రం తెలియదో చెప్పు? పేరమ్మ ఒక అశాస్త్రీయమైన పని చేసిందని చెప్పడాని కెవ దబ్బతరం? ఈపిల్ల కట్టుతాడు దాటంగానే నావొళ్లు కంపర మెత్తిపోయింది. అన్నాకదా, 'ఓసి ముండా కూతురా! ఏంచేశావే ఇవ్వేళ మంగళవారపు మాపటిపొద్దు' అని. ఇది దోషం కాదని ఏపండితు డంటాడో అనమను చూదాం. అట్లా అనే పని లేదమ్మా, అట్లా అనేపని లేదు. మేము మాతల్లిదండ్రులదగ్గిర నేర్చుకున్నా మమ్మా. అయితే చదువుకుంటూందిగా మీ అమ్మాయిని పిలూ, ఏమైనా చెప్పగలదేమో!'

జగదంబ నిశ్శబ్దంగా తప్పొప్పుకుని — 'కొంచెంసేపు కూచుని పోరాదా అత్తా' అని అంది.

'వొద్దు వొద్దు' పొద్దూకింది. ఇంకోనా డొస్తాకాని, ఒసే మొద్దూ పద ఇంటికి పద. అని పేరమ్మ, మనుమరాలిని ముందు నడిపించి తాను

రెండడుగులు వేసి హఠాత్తుగా వెనుదిరిగి నిలబడి—'అయితే జగదాంబా! అటువంటి సంబంధం చెయ్యి జార్చుకున్నారెందుకు చెప్పూ కొంచెం వింటాను' అని అంది.

'లేదు, ఇంకా సరిగ్గా చెయ్యి జార్చలేదు. అయితే ఏమిట్రా, ఇల్లూ వాకిలీ పొలమూ పుట్రా ఏమీలేదు, వయస్సు ముదిరింది—మీ అల్లుడుగారి కిష్టం లేదత్తా.'

నిర్వైరతో నిలబడి పేరమ్మ—'ఏమిటీ? మళ్లా అను ఆ మాట? అతని కిల్లులేదు; సరే మీకుందా అంట? మీకు మరి పిల్లా పాపా లేదాయె, ఉన్నదొక్క ఆడుపిల్లాయె; అందుకోసం ఇంత ఆలోచనా? ఈపిల్లనూ ఆ అల్లుణ్ణీ పెట్టుకుని చాఖుగా కాపరం చేయవచ్చు. ఇక ఈడా? కులీనులైన గృహస్థుల వలెనే యాభై రెండేండ్లున్నయ్యంటే ఆనో ఈడు ముదురటంలో లెఖ్ఖా? వైకుంఠపురాగ్రహారపు జుయ - అప్పయ్యదీక్షితులుగారి దౌహిత్రుడు! ఇంకా అతని వయస్సు ఎవరు చూస్తారు చెప్పు జగదాంబా? సరే, అదల్లా ఉంచు. ఒకసారి నీకూతురు వయస్సుకూడా లెక్కేసుకో చూడుమరి. ఇంకా వెనుకముందులు ఆలోచిస్తే పెళ్లిచేసినట్టే. చివరకి మీచిన్నమ్మలాగా వృద్ధకుమారిగా కూర్చోబెట్టాలిసిందే' అని అన్నది.

జగదంబ సిగ్గుపడి—'నేనూ ఈలాగే అంటున్నానమ్మా, కాని పిల్లదాని తండ్రి కేమో...వాక్యం సంపూర్ణంగా వినగల ఓపికకూడా పేరమ్మకు లేకపోయింది. ఆమె మండిపడి—'పిల్లతండ్రి, అల్లా యెందుకనడు? ఆహాహా! తనకు సొంతంగానే ఎన్నో యిళ్లూ, ఎన్నో పొలాలూ ఎంతో సంపత్తూ, మహా ఉన్నట్టు! మిమ్మల్నిచూస్తే నవ్వొస్తూంది. ఇంతేకాకుండా ఇప్పుడు ఆ వర్తులుగారి ఇంట్లోనే రేయింబవలూ మీవారి విడిదిటగా? అక్కడే పాటకచేరీ లటగా? కాఫీపర్యంతమూ అక్కడే నడుస్తూందిటగా? ఇటువంటి సదాచారసంపన్నుడు పిల్ల నీయటానికి సందేహించకపోతే శాస్త్రుల్లుగారు సందేహిస్తారా? మీపని మరీ హద్దు

మీరింది జగదాంబా! ఇదుగో విను. ఎవడో వరుడు దొరికాడంటే వెంటనే ముడిపెట్టుకోడం మంచిదికాని, 'ఈవరుడు బాగుండలేదు: ఆ వరుడు బాగుండలేదు' అని కూచుని తుదకు అతి లోభంచేత సర్వనాశం చేసుకోడం మంచిదికాదు. నీ పింతల్లి వృద్ధకుమారియై పెళ్లీ పెటాకులూ లేకుండానే ప్రాణాలు విడిచింది. మీతండ్రిగారి పిన్నమ్మలిద్దరికీ ఎంత కొట్టుకున్నా పెళ్లే కాలేదు. నీ తల్లిదండ్రులు కాశికి పరిగెత్తకపోతే నీకుమాత్రం సమయానికి పెళ్లయేదా? మీ అత్తగారు కాశీనివాసం చేస్తూంది, కట్నకానుకలేమీ లేవు, నీమగడు ఇస్కూల్లో చదువుకుంటున్నాడు, వరుడు దొరికాడు గదా అని రెండోమాట లేకుండా మూడుముళ్లూ వేయించి అల్లుణ్ణి తీసుకుని దేశంలోకి వచ్చారు. ఎవరైనా పడగొడతారేమో అనే భీతితో పెళ్లిమాట బెసకనిచ్చారు కాదు. మంచిపనే చేశాన్లే, అలా కాకపోతే నీకు పెళ్లయేదో లేదో ఎవరు చెప్పగలరు? ఊఁ! పద, రుక్కూ! జే అప్పయశాస్త్రిలవారి దౌహిత్రుడు! అతనికింకా ఇల్లుందా వాకిలుందా, ఊరుందా గోడుందా, అందముందా చందముందా? ఓ ఎన్నిమాటలు వినాలిసొచ్చెయ్? ఊఁ నడూ. రుక్కూ! ఆలస్యం చెయ్యకు. బట్ట లుతుక్కొని జపం అయేసరికే ఇవ్వాళరాత్రి ఒకజాముపొద్దు పోయేట్టుంది. కాని జగదాంబా! ఆమాటకూడా ఇప్పుడే చెపుతున్నా విను! కిరస్తానీవాళ్లనూ నూనివాళ్లనూ ఇంట్లోకి రానియ్యకు. పిల్లదాంతో మాటామంతీ హాస్యమూ జోస్యమూ చేయనిస్తే బాగావుండదు. నాలుక బుజాన వేసుకుని తిరిగేవాళ్లుంటారు. గోల అయిందాఅంటే మగడు దొరకడం సులభం కాదమ్మ! లే లే రుక్కూ పద పద. ఇంకోళ్లమాటలంటే మరి కదలవ్ బండా!' అని వాగుతూ వాగుతూ మనమరాలు ముందర నడుస్తుండగా, పేరమ్మ బయలుదేరింది. జగదంబ సందేహించే విరసమైన మొహంతో ఆ దిక్కుకేసే నిలబడి చూస్తూంది. హఠాత్తుగా ఆమె యేకాగ్రత భగ్నమయినట్లయింది.

'రుక్కూ! కొంచెం నిలబడమ్మా! తోటలోంచి నాలుగు వంకా

యలూ అనపకాయలూ వచ్చేయ్. తీసుకుపోదుగాని ఉండు, తొందరగా తీసుకొచ్చి ఇస్తానుండు' అని జగదంబ గబగబా లోపలికి వెళ్లుతుండగా పేరమ్మ పులకితయై ఆశ్చర్యంతో 'ఏమిటీ? వంగ లప్పుడే కాపు దిగ య్యా?' అని అంటూ కంఠస్వరాన్ని వెంటనే తగ్గించి—'ఒసే రుక్కీ! పాడుమొహం! ఛీరామేకల్లా నుంచుంటివేమే! కూడాకూడా పోరాదూ?' అని పర క్షణంలోనే వెనుకనుంచి 'ఒసే పరుగెత్తుకురా! నేను నడుస్తుం టాను' అని అరిచింది.

౨

ఎదురుగుండా ఉన్న అరుగుమీదకూచుని సంధ్య ఏకాగ్రచిత్తంతో కుట్టుపని చేస్తూంది. జగదంబ జపంగట్రా చేసుకుని పూజాగృహంలోంచి బయటికొచ్చి క్షణకాలం కూతురికేసి ఆట్టేచూచి—'పొద్దుట్నుంచి అంత కుట్టుపని ఏం మునిగిపోయింది, ఇక తిండీతిప్పలూ అక్కర్లేదా? నిన్నే కదా పథ్యం తిన్నావ్! ఇంత పొద్దోయె. ఆకలి మందగించి మళ్లీ తిరగ బెడితే? తరువాత నీయిష్టం' అని అన్నది.

పళ్లతో పట్టుకున్న నూది తీస్తూ సంధ్య 'నాయనగారింకా రాలే దమ్మా' అని అంది.

'ఆసంగతి నాకు తెలుసు. డబ్బు పుచ్చుకోకుండా పాడివైద్యం చెయ్యడాని కెంత పొద్దోతుందో అదిమాత్రం నేనెరగను. పొద్దుపోతే పోయింది, నేను కనిపెట్టుకుంటానుగా. ఉపోషం చేస్తూకూచోడం నీ కెందుకూ?'

సంధ్య పడీపప్పుడూ లేకుండా తనపని తాను చేసుకుంటూ కూ చుందిగాని జబాబు చెప్పలేదు.

'ఎవరిదా కుట్టేది కొంచెం చెప్పూ వింటా.'

జవాబు చెప్పటాని కిష్టంలేని అస్ఫుట కంఠంతో కూతు రిల్లా అంది—'రెండే రెండు గుండీలు. ఇవి కుట్టి లేస్తా.'

'ఆసంగతి నాకు తెలుసునమ్మా, ఆసంగతి నాకు తెలుసు. నాబట్ట కుట్టవచ్చావని నే ననుకోలేదు. జగత్తులో నీతండ్రే తండ్రి. ఇక ఎవరికీ తండ్రులు లేరు. ఎక్కడ బొత్తాము ఊడిపోయిందో బట్ట ఏమూల కొంచెం చిరిగిందో చూస్కో ఏమూల కొంచెం డాగుపడిందో బూడును లెక్కడ కుట్లు ఊడెరొయ్యో,—ఇవే పట్టుకుని రేయుంబవళ్లూ కూచుంటావ్, సంసారంలో నీకు వేరేమీ పనిలేనట్లు.'

సంధ్య కొంచెం మొహమెత్తి నవ్వి,—'నాయనగారు రివి యేవీ చూసుకోరమ్మా' అని అన్నది.

ఈ ప్రత్యుత్తరానికి తల్లి ఏమీ సంతోషింపక ఇల్లా అంది: డబ్బు పుచ్చుకోకుండా చేసే పాడివైద్యంలో ఇవన్నీ చూచుకోవడానికి తీరికుంటేగా? పరేకాని ఉప్పర్లు లేచిపోయారా లేదా అంట?

'లేచిపోక యేం చేస్తారమ్మా?'

'ఇంకా యెప్పుడు? ఇల్లంతా అంట్ల మంగలంచేసి మలమూత్రాల్లో కలిపాకా? ఇంకా యేముంది; నీకు ఈ సూదీ దారం ఒకటి దొరికింది. ఇంకా లేవవ్ కాబోలు!

'నీవు పదవమ్మా నేను నీ వెనకాల్తే వస్తాను.'

'ఈ జబ్బుఒంటితో నీ యిష్టంవచ్చినట్లు చేసుకో!,—మీ ఇద్దరికీ చెప్పలేక చెప్పలేక నాతల పగిలిపోతూంది. నాకిహ సంసారం అక్కర లేదు,—ఇహ నేను మా అత్తగారిదగ్గరికెళ్లి కాశీవాసం చేస్తాను—ఈసంగతి మీకు స్పష్టంగా తెలియజెప్పుతున్నాను.' అని జగదంబ పట్టరాని కోపంతో బిందె తీసుకుని దొడ్డిదారిని చెరువుకు పోయింది.

తలవంచుకునియున్న సంధ్య, మొహం చిట్లించుకుని కొంచెం నవ్వింది కాని తల్లికేమీ జవాబు చెప్పలేదు. ఆమె చేతిలో పని పూర్తి అయింది. సూదీ దారపుబంతీ ఎప్పటిలాగానే సామానుపెట్టెలో పెట్టి లేవబోయేటంతలో తండ్రి కోలాహలం వినబడింది. తలయెత్తి చూచింది. అతనిదెప్పుడూ గడబిడస్వభావం. అతని చేతిలో ఒక హోమియోపతీ మందులపెట్టెయున్నూ చంకలో ఒకటి రెండు వైద్యగ్రంథాలున్నూ ఉన్నాయి. అతడూ వడివడిగా ఇంట్లోకి వచ్చాడు. కూతురు ఎట్టెదుట కనబడంగానే 'సంధ్యా! కొంచెంలేచి నా పెద్ద మందులపెట్టె— ఊ— వెంటనే— ఇప్పుడేం చెయ్యాలో తోచడంలేదు— ఇటువంటిచిక్కుల్లో—' అని అన్నాడు.

సంధ్య చటుక్కునలేచి తండ్రి చేపెట్టే పుస్తకాలూ తీసి ఒకపక్క పెట్టి, తండ్రిచేయి పట్టుకుని వరాండాలో పరిచివున్న నాపసివాద కూచోబెట్టి విసినికర్రతో విసురుతూ— 'నాన్నా! ఎన్నో ఇంత ఆలస్యమయిందేం?' అని అడిగింది.

ఆలస్యమా? తింటానికీ తేడటానికీ నాకు తీరికవుండదని మీ రనుకొంటున్నారుకాబోలు పాపం! నే నేరోగిని చూసేకపోతే ఆ రోగికి ఎంత కోపం ఎంత అభిమానం? అబ్బబ్బ! కాంతారావుకుండే శాంతంత ఉండపోతే యెవళ్ళూ బతికేట్లే లేరు. ఈ భయం కేవలంగా అసత్యమనేనుకుమీ! అయితే కాంతారావు ఒక్కడే కాని ఇద్దరు కాదుగదా! సత్యనందయ్య ఉన్నాడే అతడు ఎటువంటివాడయితే మనకేం? ఏదో ప్రాక్టీస్ చేస్తున్నాడులే! రెండుమూడు మందులపేర్లు తెలియకపోవులే! అయితే అతడు పనికిరాడూ? ఊఁ. హుఁ. అతగాడు వీళ్ళెవళ్ళకూ పనికిరాడు. మరి? కాంతారావుగారిని పిలవకతప్పదు. నేనీ వైద్యులందరికీ ఏమని చెప్తా ననుకున్నావ్? 'ఒక మందుతాలూకు సిమ్‌టమ్ అనగా నిదానం, స్వభావం, కంఠపాఠం చెయ్యంగానే అయిందీ? ఆరే ఇదంత చూడంగానే

వచ్చేవిద్య కాదు. అలావస్తే అందరూ డాక్టర్లే అయ్యేవారు. అందరూ కాంతారావులే అయ్యేవారు' అని.

'నాన్నా! చొక్కా విడు.'

'ఇదిగో విప్పుతా'. ఇదిగో ఇప్పుడే,—గమ్మున పల్సెటిలా ఇచ్చేకావుగా, ప్రాక్టీసయితే చేస్తున్నావుగాని దాని ఆక్షన్—అంటే అది చేసే పని, యేమిటో కొంచెంచెప్పు చూదాం? ఏదీ నాతోపాటు కొంచెం అప్పగించగలవేమో చూస్తా' అని అంటూ. ఏదీ పుస్తకం తెయి, ఒకసారి పల్సెటిలా—

'నాన్నా! నీకింకా పుస్తకం చూడాలా? భోజనా లయింతర్వాత ఆ మందునుగురించి మీవద్ద పాఠం చదువుకుంటాను లెండి. పాఠం చెబుతావా నాన్నా?'

'చెప్పకేమమ్మా చెప్పకేమి? నక్స్వామికాకూ దీనికీ భేదముందసలు—ఏదీ ఆపుస్తకం ఒక్కసారి—'

'కాళ్లకు చమురు రాతునా నాన్నా? ఎంత పొద్దోయిందో చూశావా? మళ్లా అమ్మ కోప్పడుతుంది.' అని చెరువునుంచి తల్లి వస్తూందేమోనని బెదురుతూ బెదురుతూ చూచి, తండ్రి వద్దనకముందే సీసాలోనుంచి కొంచెం నూనె తీసుకుని కాళ్లకు పులిమింది.

'అబ్బ! కొంచెం ఆగకపోయావా? ఒకసారి చూసేస్తే—'

'ఇవ్వాళ ఎవర్నెవరిని చూశావ్ నాన్నా! కోదండరామయ్యగారినీ'

'ఆ ముసిలాడా? బతకడు బతకడు. నీవోసారి చూచిరా! ఇదుగో ఆమధ్వ, వెధ్వ! ప్రాణాచార్లు! వాడిమీద కేసుపెట్టక మానను. నేనేరోగి దగ్గిరికి వెళ్తానో తానుగూడా ఆరోగిదగ్గిరికే (నే నీతలికి రాంగానే) వెళ్లి నాప్రాక్టీస్ పడగొట్టేస్తున్నాడు. నా మందొకనాడేతప్ప రెండోనా డెవళ్లూ

పుచ్చుకోకపోవడం ఎందువల్ల ? ఈ అపాత్రుడివల్ల. ఈ బెండకాయ్ బొట్టూ వల్ల. ఏ డేంచేశాడో తెలిసిందా ? కోదండరామయ్యకు నేనోమందు పెరె కట్టు చేసి ఇచ్చి ఈతలికి రాంగానే మెల్లిమెల్లిగా ఈపాడుగట్ట లోపలికి దూరి 'ఏదీ ఆయనిచ్చిన మందు ? ఏమిచ్చాడో చూదాం' అని అడిగాట్ట.

సంధ్య కోపస్వరంతో 'ఏమ్మాట ?' అని అన్నది.

సంధ్యతండ్రి, అంతకంటె కోపస్వరంతో ఇల్లా అన్నాడు_'వెధవ! అంట్లవెధవ ! నామాత్రలన్నీ నోట్లోపోసుకుని కసపిస నమిలి, 'ఛీ ! పాడు మందు ! ఇదిగో చూశారా అన్నీ మింగేశాను. ఏదీ నామందు తాగమనండి మా వైద్యుణ్ణి ?' అని ఒకసీసా ఆముదం ఇచ్చి వచ్చేశాట్ట ! నేను ఇవ్వాళ పోంగానే ఆ కోదండరాము డన్నాడు కదా—'అయ్యా కాంతారావు గారూ ! ప్రాణాచార్ల వారు మీరిచ్చిన మందంతా గుటుక్కున ఒక గుక్క లో మింగేశారు, మరి మీరుకూడా వారిమందు అలాగా తాగ్గలిగితే నే ఇవ్వాళనుంచీ మీమందు నేను పుచ్చుకుంటాను, లేకుంటే పుచ్చుకోను' అని.

సంధ్య కలవలపడి 'నీవు తాగలేదుకద నాన్నా అని ప్రత్యుత్తరం కోసం ఎదురుచూచింది.

'లేదు, అది నేన్ తాగుతానా ఏమిటి ? సరేకాని ఇవ్వాళ ఇంత పర్యంతమూ ఇల్లిల్లూ తిరిగా ! ఒక్కరోగినైనా చిక్కించుకో లేకపోయా. ఇదిగో నీకు చెప్పంచుతున్నా సంధ్యా ! ప్రాణాచార్లమీద కేసు పెట్టక మానను.

క్రోధచేతా అభిమానంచేతా సంధ్యకళ్లల్లో నీళ్లూరెయ్ ! సంసా రంలో సంభవిస్తున్న అన్నిరకాల ఆఘాతాలనుంచీ, ఉపద్రవాలనుంచీ, నిందలనుంచీ, పరియాచకాలనుంచీ తా నీతండ్రిని రక్షించుకోడంకోసం సంధ్య తన రెండుచేతులనూ పదిచేతులుగా చేసి అడ్డంపెట్టుకుంటూ వస్తూంది.

'ఎందుకునాన్నా నీవు ఎండనక వానసక ఇతరులకోసం తిరగడం ?

ఎందరెందరో రోగులు మందుకోసం మన యింటిచుట్టూనే తిరిగిపోతున్నారు.'

ఈమాట సత్యానికి కొంచెం ఎడం. కాంతారావు ముఖం చూసికాదుగాని సంధ్యనుచూచి బీదవాళ్లు కొందరు మందుకోసం రావడం నిజమే. సంధ్య తనతండ్రిదగ్గిర చిన్నచిన్న రోగాలకు చికిత్స చేయడం నేర్చుకుంది. ఆమె మందు పనిచేయకపోడమంటూకూడా లేదు. లోకులు కాంతారావును యముణ్ణి చూసినట్లు చూస్తారు. అతని చేతుల్లో పడకుండా ఉంటానికిగాను అరుగులూ గుమ్మాలూ పరీక్షించి సంధ్యదగ్గిరకొచ్చి మందు తీసుకపోతుంటారు. సంధ్యకీ సంగతులన్నీ తెలుసు. కాని యిపుడిల్లా తండ్రికోసం అబద్ధ మాడవలసివచ్చింది.

కాని తండ్రి గడబిడపడి,—'తిరిగి వెళ్లిపోయినారా? ఎవరెవరు? ఎవరి తాలూకు? ఎంతసేపయింది వెళ్లి? ఏదారిని వెళ్లాయి? ఊరూ పేరూ కొంచెం కనుక్కున్నావా?' అన్నాడు.

సంధ్య లోలోపనే లజ్జించి,—'వారి ఊరుపేరులు మనకెందుకు నాన్నా? వాళ్లంతట వాళ్లే ఇప్పుడు మళ్లా వస్తారు' అని అన్నది.

'మీతో నేను వేగలేను దేవుడా! పేరు కొంచెం కనుక్కుంటే ఏం పోయింది? ఒక చుట్టుతిరిగి వచ్చేవాణ్ణి. 'ఆలస్య మమృతం విషం' ఒక్క మాత్రతో వాళ్ళ రోగాలూ గీగాలూ పోగొట్టేవాణ్ణి.'

సంధ్య మరి మాటాడక కూర్చుని చమురు పాముతూంది.

'ఎపుడు మళ్ళా వస్తామని చెప్పి వెళ్లారు?'

'సాయంత్రం రావచ్చు.'

'రావచ్చా? ఎటువంటి పొరపాటు జరిగిపోయిందో కొంచెం ఆలోచించి చూడు. ఇహ రారేమో. విస్సన్నవద్దకు పోయి పడరుకదా? వాడు— ఆ ప్రాణాచార్లు—ఎప్పుడూ ఈచూపుమీదే ఉంటాడు. ఈ

లోపుగా వాడు తెలుసుకోడుగద? ఓయ్ దేవుడా నేను వేగలేను. సంధ్యా! కందిపప్పు సెనగపప్పు కాస్త పెట్టి ఒకగంటసేపు వాళ్ళ నాప లేకపోయావా? ప్రతీదీ చెప్పాలి, ప్రతీదీ చూపించాలి. ఎవరువారు? ఎవ రా తొంగి చూసేది? ఇల్లా రారాదూ? రామస్వామా? కుంటు తున్నా వెందుకుచెప్మా?"

కాంతారా విల్లా కమ్మగా పిలిచి ఆదరం చూపడంవల్ల రామస్వామి లోపలికి వచ్చాడు. అతడు నడిప్రాయంవాడు. కాపు. అతడు ముంగిట్లో వచ్చి నిల్చుని ఉదాసీనస్వరం పెట్టి 'చిత్తం, మరేమీ లేదండీ' అని అన్నాడు.

'ఏమీ లేదూ? విలక్షణంగా ఉండిపోయింది!' చక్కగా కుంటు తూ? నూని రాయడం కొంచె మాపు సంధ్యా.! ఏమీ లేదూ? స్పష్టంగా ఆరనికాలేను కనబడుతుంటే!—కాదు కాదు తమాషాకాదు, రామ స్వామీ! ఏదీ కాలు చూపూ.'

కాంతారావు 'కాలు చూపూ', అనంగానే రామస్వామి ఒకసారి సంధ్యకేసి జాలిగా చూచి ఆతరువాత 'బాబయ్యగారూ! ఈకాలు కొంచెం జారి నలిగింది. ఆపళంగా కింద పడిపోయాను' అని అన్నాడు.

కాంతారావు కూతురుకేసి ఒకసారిచూచి నవ్వి 'సంధ్యా చూచావా! నేను చూచీచూడడంతో టట్టే ఆరనికా కేసని చెప్పాశాను గదా! మాకు చూడంగానే తెలిసిపోతుంది. ఊఁ. ఎల్లా పడ్డావ్?

'చిత్తం, కాలుజారి అని చెప్పానుగందా! మా యింట్లోనే దర్వాజా పక్కనే జలదారి ఓటి తగలడ్డది బాబు. దానిమీంచి నడవటానికని ఒక చిన్నబల్ల ఉండదండి. గుంటసన్నాసులు ఆ బల్లను అతలికి లాగేశారండి. మనస్సు ఎక్కడో ఉండి నేను—

'మనస్సు ఎక్కడో ఉందా? ఏగనస్—ఎపిస్! సంధ్యా! జాగ్రత్తగా విను. స్వభావమున్నదే అది అసలు కనిపెట్టాలి. స్వభావమే అసలు వస్తువు. మహాత్మా హేరింగ్ ఏం చెప్పాడంటే,—ఊం. మనస్సెక్కడో వుండి,—ఊం. తరువాత?

'కాలు పెట్టాను లోపలికి. లోపలికి పెట్టగానే పెడాను తొక్కేసిందండి.'

'ఆగూ ఆగూ. కాలు నలిగిందంటివి. కాలు నలగడమూ కాలు పెడాను తొక్కటమూ ఒకటి కాదు రామస్వామి కావూ!'

'సత్తెం. కాదు బాబయ్యా! కాలు ఇరుకున పడ్డదికదూ నలిగిన మాట సత్తెమే. జారిపడ్డాను.'

'ఊం. మన స్సెక్కడో ఉండి, మనస్సు తిన్నగా ఉండదు. ఇప్పుడే చెప్పడమూ, ఇప్పుడే మరవడమూ ఈ రెండూ ఉంటయ్. ఏగనస్-ఎపిస్! ఊం. ఆతరవాత?'

'ఆతరవాయి మరేముంది బాబయ్యా నిన్నటినించీ కాలు నేలమీద పెట్టలేకండా వున్నాను.' అని రామస్వామి ఉత్సుకదృష్టితో ఒకసారి సంధ్యకేసి చూచి నిట్టూర్చాడు.

సంధ్య వడివడిగా 'నాన్నా పొద్దోయింది. కొంచెం అరని కా—

'ఆఁ. ఆఁ. ఆగు సంధ్యా! నేను కొంచెం స్టడీ చెయ్యనీ! సిమిలియా సిమిలిబస్! రెమెడీ సెలెక్టు చేయమంటే పిల్లాళ్ళతో ఆడుకోవడం కాదు. పేరు కాస్తా పాడై పోతుంది. ఊం. అటు తరవాయ్? నొప్పి ఎల్లా వుందో కొంచెం చెప్పు రామస్వామీ!'

'సత్తెం. నొప్పంటే నొప్పా? చాలా నొప్పిగా వుందండి, బాబయ్యా'

‘అది కాదోయ్ అది కాదు. ఏరకం నొప్పి? ఘర్షణవత్, మర్షణ వత్? సూచీ విద్ధవత్, వృశ్చిక దంశనవత్? పీకుతున్నట్లుందా నములు తున్నట్లుందా? సూది గుచ్చుకున్నట్లుందా, తేలు కుట్టినట్లుందా? కరకర మంటూందా, భగభగ మంటూందా?’

‘సిత్తం బాబయ్యా! అల్లాగే వుంది.’

‘ఆలాగయితే భగభగమంటూం దన్నమాట. సరిగ్గా అంతే. ఆ తర వాయ్ఁత?

‘ఆతరవాయ్ ఇంకేముందండి బాబయ్యా, నిన్నటినుంచీ సచ్చి పోతావున్నాను బాబయ్యా!’

‘ఆగూ ఆగూ! ఏమన్నావ్? సచ్చిపోతావున్నావ్?’

వినుగుపుట్టిపోయి రామస్వామి ‘మరే ముందండి బాబయ్యా సచ్చి పోక? నిన్నట్నుంచీ కుంటికోణంగిలాగా నడుస్తున్నాను. కాలు తిన్నగా పెట్టలేను,—ఇంతకన్న వేరే సావున్నదండీ? ఆ గుంటల్లు! దుర్మార్గపు గాడిదకొడుకులు! చెప్పినమాట వినరు. వద్దుగా అంటే మానరు,—ఈఒజల్లకోటే సతపొద్దూ వాళ్ల కాటలు, ఎప్పుడోగత్తే చీకట్లో కాలు జారిపడి సచ్చిపోతాననుకుంటా. నాఖర్మం ఎల్లావుంటే అల్లా అవు తుంది గానీండి బాబయ్యా కాస్త మందు రాయండి, చాలా పొద్దో యింది.’

‘నాన్నా! ఆరనికా రెండుచుక్కలు.’

కాంతారావు కూతురుకేసి చూచి కొంచెం నవ్వి ‘కాదమ్మా కాదు’ ఇది ఆరనికా కేసుకాదు. విస్సన్నగనక అయితే ఆరనికా ఇచ్చేవాడే. నాలుగుచుక్కలు ఏకొనైట్ 300 పొటెన్సీ. రెండుగంటల కోసారి పుచ్చు కోవాలి.’

సంధ్య తన కళ్లు రెండూ విప్పార్చి,—ఎకోనైటా నాన్నా? అని అన్నది.

'ఔనమ్మా తల్లీ ఔను. మృత్యుభయం! మృత్యుభయం! పడి చస్తానని మృత్యుభయం! సిమిలియా సిమిలిబస్ క్యూరెంటార్! మహాత్మా హేరింగ్ ఏమి చెప్పాడంటే,—ఒకే రోగానికి కాదురా చికిత్స, రోగికి రా!' అని చెప్పాడు. మృత్యుభీతికి ఎకొనైట్ ప్రధానం. విస్సన్నయితే— ఏస్, ఏస్, అడ్డమయినవాళ్లంధరూ చికిత్సచేయడానికి బయలుదేర్తారు. సీసా పుచ్చుగుని మా అమ్మాయితో వెళ్లు రామస్వామీ! రెండుగంటల కొకసారిచొప్పున నాలుగుసార్లు పుచ్చుకో. సాయంకాలం వచ్చి నేను చూస్తాను. మంచిది, సమయానికి గుర్తొచ్చింది, విను, వాడున్నాడే వాడు ప్రాణాచార్లు, డాక్టార్, 'ఏదీ ఏం మం దిచ్చాడో చూతాం?' అని అంటాడు. ఖబర్దార్! సీసా చూపావా అంటే నీపని ఉండే. ఆ భటా చోర్, సీసా గడగడా తాగేసి అందులో ఆముదం పోసిపోతాడు. ఊం. అబ్బా! కడుపు నులిమేస్తూందే!'

రామస్వామికి మందివ్వడానికి సంధ్య లేచింది. 'సీసాలో ఉన్న ఆ ఆముద మంతా నీవు తాగి రాలేదుకదా నాన్నా?' అని తల్లడిల్లిన భయస్వరంతో అడిగింది.

'లేదే. ఉం. ఇత్తడి చెం బేదీ?'

'అలాగయితే బహుశా నీవు—'

'లేదు లేద్లేదు. ఇత్తడిచెం బోసారి తొందరగా! తగలబడ్డ కొంపలో ఏదీ ఎక్కడా సరిగ్గా దొరికితేనా? చెంబు లేకపోతే లేకపోయిందిలే!—' అని అంటూ అంటూ ఎగరోజుకుంటూ కాంతారావు దొడ్డిగుమ్మంగుండా వెలుపలికి వెళ్లిపోయాడు.

'రామస్వామి,— అక్కయ్యగారూ! మం దైతే— సంధ్య చకితు

రాత్రి,— ‘మందా? ఇదుగో తెచ్చి ఇస్తానుండు’ అని అన్నది.

‘అమ్మాయిగారూ! మీ రంటికేరే దాని పేరు? ఆఁ. అరణ్యా, అరణ్యా! అది రెండుచుక్క లివ్వండమ్మ! బాబయ్యగారి మందు రాకుండా చూడం డమ్మ.’

సంధ్య లోలోపల కొంచెం వ్యథపడి— ‘నాన్నకన్న నా కెక్కువ తెలుసు ననుకొన్నావా?’ అని అంది.

రామస్వామి సిగ్గుపడి—‘అది కాదండమ్మా అది కాదు. బాబయ్య గారి మందు చాలా ఘాటయిన మందం డక్కయ్యగారూ. అది నిలేసి మాటాడుతుంది. నేను చూడండి ఉలిపిరిగొట్టును. ఇదో నేను పోయి రావూరి రామయ్యను మాయచేశో గీయచేశో పంపకపోతే చూడండి. నిన్న ట్నుంచీ కడుపునొప్పిగా ఉందంటున్నాడు. నాన్న గారి మందు తగలం గానే వాడు బాగై పోతాడు. నాకుమాత్రం ఇదో ఇందాక మీరు చెప్పిన మందే-అదే ఇప్పుడివ్వండమ్మా’ అని అన్నాడు.

సంధ్య చిన్నబుచ్చుకుని ‘మంచిది, ఇలాగ రా’ అని అంది.

ఇల్లా అని సంధ్య రామస్వామిని వెంటబెట్టుకొని వరాండాలోంచి పక్కగా ఉన్న ఒక గదిలోకి వెళ్ళింది.

జగదంబ దేవగృహంకోసం ఒక బిందెడు నీళ్ళు తేవడానికి చెరువుకు వెళ్ళింది. ఆమె యింట్లోకి వస్తూనే తిన్నెమీద నీటిబిందె ధామ్మని కూలేసి క్రుద్ధస్వరంతో ‘సంధ్యా’ అని పిలిచింది. ఇంట్లోఉన్న సంధ్య ‘ఏమమ్మా?’ అని అన్నది. ‘మీనాన్న ఇంకా ఇంటికి జేరలేదూ? అలా అయితే ఈవేళ దేవతార్చన అపు చేయవలసిందేనా?’ అని అన్నది.

కూతురు అనేంటూ వచ్చి ‘నాన్న వచ్చి చాలా సే పయిందమ్మా’ నూని రాసుకుని స్నానానికి వెళ్లారు. అని అన్నది.

‘ఏరీ ఎక్కడ వెళ్లారు? చెర్లో కనబడందే?’

అత నెక్కడికి వెళ్లాడో సంధ్యకు తెలుసు. కొంచెంసే పూరుకుని ‘ఓహో ఇవ్వేళ ఏటికి వెళ్ళుంటారు. చాలా సే పయిందమ్మా వెళ్లి. ఈపాటికి వస్తూఉండాలి’ అని అంది.

జగదంబ కొంచెమైనా శాంతింపకపోగా పైపెచ్చు మహా ఉత్తప్త మయిన స్వరంతో ఇల్లాఅనడం మొదలెట్టింది: ఈయన్ను పెట్టుకొని నేనిహ వేగలేనే సంధ్యా! వెళితే ఆయనయినా ఇక్కణ్ణుంచి వెళిపోవాలి, లేక పోతే నేనయినా వెళిపోవాలి. ‘దేవతార్చన బ్రాహ్మడు ఇవ్వాళ రాడు, మీరు తొందరతొందరగా రండ’ని ఎన్నోసార్లు చెప్పాను. అల్లా చెప్పినా ఇదా వచ్చేవేళ? దేము డింతవరకూ నెత్తిమీద రెండు నీళ్లయినా నోచుకోలేదుగదా! అదల్లా ఉండనీ! నిన్న రాత్తిరి ఏం చేసొచ్చారో తెలుసా? మాణిక్యంనోటుమీద అసలీ ఫాయిదాలు ముట్టినట్టుగా రసీదు ఇచ్చి వచ్చేశారు.

సంధ్య చాలా అనుమానంతో ‘ఎవరు చెప్పారమ్మా?’ అని అన్నది.

‘ఎవరేమిటే? మాణిక్యం చెల్లెలే చెప్పిపోయింది’. ఆడబిడ్డా తానూ చెరువుకు స్నానానికి వచ్చి.’

సంధ్య కొంచెం నవ్వడానికి ప్రయత్నించి ‘అన్నకూ చెల్లెలికీ పడదమ్మా! బహుశా ఇది నిజమై యుండదమ్మా!’ అని అన్నది.

తల్లి కోపంతో ఇల్లా అన్నది: నీవు ప్రతిమాటా దాస్తావెందుకు చెప్పూ! జ్వరం వచ్చిందని చెప్పి మంగలి మాణిక్యం పిలుచుకుపోయాడు. ధన్వంతరంతవాడని కాళ్ళట్టుకున్నాడు, మందు తిన్నాడు. ‘జమీదారుడ’ని ‘దానకర్ణుడ’ని కొండెక్కించాడు. నవ్వుతూ నవ్వుతూ లూటీ చేసేశాడు. ఛీ! డబ్బుపోతే పోయిందిగాని, ఇంటికి పోయి లాభంలేదు,—ఈబిండె మెడకు కట్టుకుని చెర్లో మునిగి చద్దామనిపించింది. నన్నిప్పుడు మరీ, రేపుకో

తింటున్నారు! నేనీ సంసారం ఎల్లా నిర్వాకం చేసుకోగలనో నివ్వే చెప్పు సంధ్యా!'

'ఎన్ని రూపాయ లమ్మా?'

'ఎన్నా? పది పన్నెండు రూపాయలకు తక్కువై ఉండదుసుమీ! పిడికెడు రూపాయ లిల్లా ఇష్టం వచ్చినట్లు——

జగదంబ మాట ముగియడానికి వీలు కలుగలేదు. కాంతారావు తడి బట్టలతో గడిబిడగా ఇంట్లోకి వస్తూవస్తూ పెద్దపెట్టున—'సంధ్యా! గావం చా—గావంచా—గావంచే—ఒకసారి ఇల్లా యియ్యమ్మ! ఎకోనైట్ మున్నూర్ పొటెన్సీ. పెట్టెలో సాజాగా మూల——

జగదంబ సెగలతో పొగలతో లేచి 'ఎకోనైటంతా నే మింగేశాను. మామగారి మెతుకులతో రాజ్యమేలడానికి మీకు సిగ్గులేదూ? మంగలి మాణిక్యానికి ఫాయిదా తీసేయమని మీకెవరు చెప్పారు? ఎవరి జాగాలో మీరు ఉప్పర్లనూ సాప్పర్లనూ ఉంచారు? ఎవరి పొలం మీరు గోచర మని దానమిచ్చి వొచ్చారు? కాపరానికి వచ్చింగగిర్నుంచీ మీరు నా రక్తమాంసాలు వండుకో తింటున్నారు. ఈ రోజున నేనైనా ఈ యింట్లోంచి వెళ్లిపోవాలి. లేకపోతే నా యింట్లోంచి మీరైనా వెళ్లి పోవాలి.' అని అంది.

'అమ్మా! రెండుజాములప్పుడు నీవీ మాటలన్నీ ఎందుకు మొంద లేశావో చెబుదూ' అని తీవరించి అన్నది సంధ్య.

తల్లికూడా అల్లాగే జవాబు చెప్పింది—'దీనికింకా మధ్యాహ్నం ఏమిటి పొద్దునేమిటి? ఆయ న్నాకెవరు? దేవతార్చన చేసి రెండు మెతుకులు ముక్కున కొట్టుకుని ఇల్లెందుకన్నట్లు లేచిపోవడమాయె. నే నెంతో ఓర్చాను. ఇహ ఓర్చలేను, లేను, లేను,' అని బిగ్గరగా అరుస్తూ అరుస్తూ అకస్మాత్తుగా ఏడుపులోకి దిగి గబగబా వెళ్లి ఇంట్లో పడ్డది.

కాంతారావు ఊఁ. అని పొడుగ్గా నిట్టూర్చి ఇల్లా అన్నాడు— ‘ఇది వాళ్ల సొమ్మనా వడ్డీరూపాయలు ఇన్ని తీసేయడానికి? అట్లా తీసెయ్యడానికి నే నెవణ్ణి మాణిక్యం?’ అని అన్నాను. మీ రే మంటున్నారు? ఒకళ్ళమాట ఒకళ్ళు వినిపించుకుంటేగా? ఇదీగాక వాళ్ళమీదగూడా తప్పు మోపడానికి వీలు లేదు. మందు పుచ్చుకుంటే పథ్యం నడుపుకునే శక్తి లేదు. నేత్రం ఇన్యూర్న్ పాలిసీ. ఒక చుక్క చొప్పున—

కళ్లవెంట నీరు జలజల రాలగా కనిపించకుండా పైటతో తుడుచుకొని సంధ్య—‘ఎందుకు నాన్నా నీవు మా అమ్మగారికి తెలుపకుండా ఈ బాజరబందీలో పడతావ్?’ అని అన్నది.

‘ఇదిగో చెబుతున్నా, పడను,—కాని కాంతారావు లేకుండా ఈఊళ్ళో ఏదీ జరగకపోవడంకూడా చూస్తున్నా’ ఎవరి కెక్కడ కాస్త పటిసెం పట్టినా, ఎక్కడెవరికి——

చెప్పవలసినదంతా సమాప్తి చెయ్యనియ్యకుండానే సంధ్య వెళ్ళి వెంటనే మడిబట్టా గావంచా తీసుకొచ్చి తండ్రి చేతి కిచ్చి—‘ఆలస్యం చెయ్యకు నాన్నా దేవతార్చన చేసెయ్, నే నిప్పుడే వస్తున్నా’ అని ఇంట్లోకి వెళ్ళింది. కాంతారావు తల తుడుచుకుంటూ తుడుచుకుంటూ బహుశా దేవగృహంలోకి వెళ్ళాలనే బయలుదేరి ఉంటాడు. ‘అబ్బా, అబ్బా! కడుపు నలిపేస్తూంది! ప్రాణాచార్ల పేర్’ అని అనుకుంటూ వెళ్ళాడు.

## 3

ఎవరిపేరు చెబితే మేకలూ పులులూ ఒక్కరేవున ఒక్కచోట నీళ్ళు తాగుతయ్యని ఆరోజున పేరమ్మ మాటిమాటికీ సంధ్యను భయ పెట్టిందో హిందూకుల చూడామణియున్నూ, పరాక్రమశాలియున్నూ అయిన ఆ తాండవశాస్త్రి ఇప్పుడే సావడిలోకి వచ్చి కూచున్నాడు.

ఆతడు కట్టుకున్నది లేతగన్నేరురంగు శనివారప్పేటంచుల మడిబట్ట. తొడుక్కున్నవి పావుకోళ్ళు. వేసింది జారు ముడి. జారుముడిలో దోపింది గన్నేరుపువ్వు. ఇవన్నీ చూస్తే ఆయన ఇప్పుడే జపమూ తపమూ చేసేసి వచ్చాడని అనుకోచ్చు. అప్పటి కింకా ఆయనవాకట్లోకి వారూ వీరూ రాలేదు. నౌకరు తివాచీలూ చాపలూ పరిచి వెళ్ళిపోయాడు. తాండవ శాస్త్రి దగదగలాడుతూన్న పొడుంకాయలోంచి ఎడమచేతిలో కొంచెం పొడుం వేసుకుని ఏదో ఆలోచిస్తూ ఆలోచిస్తూ కుడిచేత్తో ఒక పట్టు పట్టు కోవడానికి ప్రయత్నిస్తుండగా నడింతలుపు కదిలిన చప్పుడవటంవల్ల మొహా మెత్తి చూచి ‹ఎవరు ?› అని అన్నాడు.

లోపలినుండి జవాబు వచ్చింది—‹నేను. ఏమీ పుచ్చుకోకుండానే కచేరీచావడిలోకి వెళ్ళి మహా! నామీద కోపం వచ్చిందా ?›

‹కోపమా ? కోపమూ గీపమూ ఇప్పుడెవరిమీద చూపుతా చెప్పు ? అవన్నీ మీ అక్కగారితోకూడానే పోయినయ్.› అని ఒక దీర్ఘనిశ్వాసం విడిచి—‹ఊఁ. హుఁ. ఇవ్వాళేమీ తినను. ఇవ్వాళ శంకరాచార్యుల వారు అవతారం ముగించిన రోజు—ఆ సమయానికే సంధ్యావందనం గట్రా చేసుకుని ఇంత పాలూ గంగా పుచ్చుకుంటాను. ఈరీతిగానే ఈ నాలుగు రోజులూ వెళతయ్.› అని తాండవశాస్త్రి మరో దీర్ఘనిశ్వాసం విడిచి పొడుంపట్టు ముక్కుదగ్గిరికి పోనిచ్చాడు.

తెరలోంచి మాటలాడుతున్నామె తలుపు ఓరగా తెరచి ఇంటా బయటా ఎవరూ లేకుండాఉండడం కనిపెట్టి మెల్లిగా సావట్లోకి వచ్చింది. ఆవిడే విధవ. ఇరవైనాలు గిరవైఅయిదే ళ్ళుంటయ్. పాముకూసంలాటి తెల్లని సైనుబట్ట కట్టుకుంది. చేతుల కేమీ నగలు లేవు. మెడలో మాంచి లావుపాటి ముప్పేట బంగారపు హారం వేలాడుతూంది. ఆమె కొంచెం నవ్వి—‹మీరు మాట్లాడితే సరసాలు పట్టిస్తారు, లోకు లేమనుకుంటారో కొంచెం చెప్పండి ! అదీగాక నేనువెళ్ళిపోవద్దన్నా ?› అని

పరక్షణంలోనే చిన్నబుచ్చుకుని—'ఎవత్తెకు ఉపచారం చేయడానికి వచ్చానో ఆమె అందర కళ్లల్లోనూ కారం చల్లి లేచిపోయినాయి. ఇహ నేను పోయి మూడు కాళ్ళ ముదుసళ్ళ మా అత్తమామలను చూచుకోవద్దూ? తమరే చెప్పండి' అని అన్నది.

తాండవశాస్త్రి పొడుం పీలుస్తూపీలుస్తూ గంభీరుడై 'ఆ మాట నిజమే. నా సంసారం బాగా ఉండాలని మరోయింటివారి పిల్లను పట్టుకుని కూర్చోపెట్టుకోగూడదు. ఆ లా క్కాకపోతే గృహలక్ష్మి ఈ వయస్సులో ఎందుకు లేచిపోతుంది? పరమేశ్వర! సరే మంచిరోజొకటి చూచుకుని వెళ్లు! అక్కగారి కుపచారం చేయడానికొచ్చావ్, గ్రామానికంతా ఒక దృష్టాంతమైపోయేట్టుగా ఉపచారం చేశావ్! అని అన్నాడు.

మీనాక్షి ఊరుకుంది. తాండవశాస్త్రి గోరుతో కళ్ళు తుడుచుకుని ఒక నిమిషం ముక్కుతుడుచుకుని దృఢస్వరంతో ఇట్లా అన్నాడు— 'గౌరీదేవి! దానికి రోజులు నిండేయ్. దాటిపోయింది. అందుకు దుఃఖించను గాని సంసారం బయటబడ్డది. ఆడపిల్లలందరూ పెద్దవాళ్లయారు, వాళ్ళు సంతానంతో కాపరాలు చేసుకుంటున్నారు. వాళ్లకోసమూ దుఃఖించను గాని కుర్రాడున్నాడు. వాడు చెడిపోతాడని చూస్తున్నాను.'

తాండవశాస్త్రి మొహమెత్తి కొంచెం వాడునవ్వు నవ్వి 'అనకుండా ఉండడమే మంచిది కాని సమస్తమూ నా కళ్లకు కట్టినట్లు కనబడుతుంటే! పరమేశ్వర పరమేశ్వర! నీవే సత్యం. సంసారమ్మీద మతి లేదు. విషయాలు విషప్రాయంగా ఉన్నాయ్, బతికిన నాలుగు రోజులూ ఉపవాసాలతోనూ భగవన్నామంతోనూ చల్లగా వెళ్లిపోతయ్. అందుకు బెంగ లేదు,—కాని ఒకపూట రెండు మెతుకులు దొరికితే మంచిదే, దొరక్కున్నా లోటు లేదు,—కాని ఈ కుర్రాయన్నుగురించే చివరచీకు. పరమేశ్వరా నీవే గతి!' అని అన్నాడు.

మీనాక్షి కళ్ళు రెండూ తడుసుకుంటూ వచ్చేయి. తాండవశాస్త్రి భార్య మీనాక్షికి అక్కవరస. ఆమె యీ మీనాక్షిని సొంత చెల్లెలిలాగా చూస్తూ వుండేది. తాండవశాస్త్రి భార్య గడ్డు జబ్బులో పడి మీనాక్షిని చూడాలని అనుకొంది. ఈమాట విని మీనాక్షి రాకుండా ఉండలేక పోయింది. ఆ అక్క గతించి ఇప్పటికి నెల దాటింది. అవిడె పోతూ పోతూ పది పన్నెండేండ్ల కొడుకును మీనాక్షి కప్పగించి 'ఈ కుర్రవాడూ నీవాడు' అని చెప్పింది.

మీనాక్షి కరుణకంఠంతో— 'కాని చాలా కాలం నే నిక్కడుంటానికి వీ ల్లేదండీ. లోకు లేమంటానో చెప్పండి' అని అన్నది.

తాండవశాస్త్రి రెండుకళ్ళూ తెరచి, 'లోకులం ని న్ననడమేం? అని యీవూళ్లో బతకడమేం?' అని అన్నాడు. ఇంత కెక్కువ మాటలు అతని నోట్లోంచి రాలేదు, రావలసిన ప్రయోజనమూ లేదు. మీనాక్షి కీ సంగతి తెలుసు. కాబట్టి మెదల కూరుకుంది.

తాండవశాస్త్రి ఇల్లా చెప్పడం మొదలెట్టాడు— 'నామాట కెదురుమాట చెప్పేవా డింకో వూరికి పో యుండాలిసిందే; ఈ ఊళ్లో ఉండటానికిమాత్రం వీల్లేదు. అందు కాలోచన లేదు కాని ఈ కుర్రాణ్ణిగూర్చే ఆలోచన. 'నీ వంటే వీడి కెక్కడలేనీ ప్రేమ' అని చావబోయేముందు మీ అక్క వీణ్ణి నీచేతిలో పెట్టిపోయింది కాని నాచేతిలో పెట్టిపోయిందా చెప్పు?'

మీనాక్షి చాలా ప్రయత్నించి కన్నీళ్ళాపుకుని 'నా కంతా తెలుసునండీ! మా అత్తమామలు ముసలి పండ్లు. ఇంకా బ్రతికేఉన్నారుగదా! నేను తప్ప మరి వారికి గతి లేదండీ!' అని అన్నది.

తాండవశాస్త్రి పరిహాసకంగా ఇలా అన్నాడు— 'గతి లేదూ పాపం నీవే గతి కాబోలు! నీ మగడు బ్రతికి ఉంటే అవారి కేరు; కాని

పాపం నీ వతణ్ని చూసిన పాపాన పోలేదు. పన్నెండో యేటే ముండా మోశావ్!—

'మోస్తే మోశా,—మా అత్తమామలు బతికున్నంతవరకూ నేను వారి కుపచారం చేయక తప్పదు.'

తాండవశాస్త్రి ఒక్కక్షణం ఊరుకుని గంభీరంగా నిట్టూర్చి, ఇలా అన్నాడు: 'అట్లాగయితే నాకొంప నట్టేట్లో కలిపి వెళ్ళిపో! కాని ఒక్క సంగతి ఆలోచించి చూడు పిల్లా!—'

మీనాక్షి కోపగించి ఇల్లా అంది—'మళ్ళా పిల్లా? లోకులు మిమ్మల్ని ఎకచకాలు పట్టిస్తారని చెప్పలా? పేరుపెట్టి పిలిస్తే ఏం పోరాయి?'

తాండవశాస్త్రి తనమొహం కొంచెం వికసింపజేసి ఇల్లా అన్నాడు: 'పట్టిస్తే పట్టించనీ చిన్నీ! ఎకచకాలకూ నవ్వులకూ వావి కాకపోతేగా?'

మీనాక్షి ఫక్కున నవ్వేసి వెంటనే గాంభీర్యం ఎరువుతెచ్చుకుని ఇల్లా అంది—'వద్దు అల్లా అనద్దు' మీరు మొదటినుంచీ నన్ను పేరెట్టే పిలుస్తారు. ఇప్పుడుకూడా అలానే పిలవండి.'

తాండవశాస్త్రి—'మంచిదిమంచిది, అలానే పిలుస్తా'నని అన్నాడు. చూస్తూచూస్తూ ఉండంగా నున్నగా క్షవరం చేయించుకున్న ఆయన మొహం దుఃఖంచే ఆచ్ఛన్నమవుతూ వచ్చింది. ఉబ్బికొనివచ్చిన ఒక నిట్టూర్పును మెల్లమెల్లగా ఆపేసుగుని ఈ కిందిమాటలు కొన్ని తనలో తానే అనుకున్నట్టు అనుకోవడం మొదలెట్టాడు: 'గుండెల్లో రేయుం బవలూ ఏదో మంట లేవని మండిపోతూవుంటే నాకింకా నవ్వులూనూ పరిహాసాలూనా? అయినప్పటికీ మధ్యమధ్య,—అదంతా యెందుకులే, చెప్పకుండా ఉండడమే మంచిది. పుట్టి బుద్ధెరిగింతరువాత ఎవళ్లకూ అసంతృప్తి కలిగించలేదు, ఇహ ఇప్పుడు కలిగిస్తానా? విషయం విషం. సంసారం విషం. ఓ

పరమేశ్వరా నన్ను నీ పాదాలముందుకు ఎప్పుడు చేరుకుంటావో గదా!'

మీనాక్షి తడికళ్లతో చూస్తూ నిలుచుంది. తాండవశాస్త్రి మళ్లా యిల్లా అనడం మొదలు పెట్టాడు: 'ఉన్న దుండగా ఇప్పుడు మళ్లా మంటమీద మంట. పైగా రేయుంబవళ్లూ పెళ్లి సంబంధాలకు పెద్దమను షులు చేసే బలవంతాలు. వాళ్ల కంథా తెలుసు; ఏమీ దాచలేనని. 'అయ్యా మీ రంటే నాకు చాలా గౌరవం. కులీనుల గౌరవం కులీనులే కాపాడాలని నాకు తెలుసు. శోకతాపాలచేత అకాలంలో అసమయంలో ఈ వెంట్రుకలు నెరిసినమాటా నిజమే కాని నెరిసిన తల ఎల్లాగూ నెరిసిన తలేగదా! ఈ నెరిసిన తల పెట్టుకొని మళ్లా పెళ్లి చేసుకోడమూ ఇంకో బంధనం మెడకు కట్టుకోవడమూ ఏమి బాగానో ఉంటుంది' అని అం టాను. ఏం? బాగుంటుందా? నీవే చెప్పు చిన్నీ!'

మీనాక్షి కొంచెంగా శుష్కహాస్యంచేసి 'బాగానే ఉంటుంది; చేసుకోండి రెండోపెళ్లి' అని అన్నది. తాండవశాస్త్రి 'నీకు పిచ్చా, వెర్రా? మళ్లా పెళ్లా? లక్ష్మిలా నీవు నాయింట్లో ఉండంగానేనా? నీ వెన్నయినా చెప్పు, దిక్కులేని ఈ యక్కుకొడుకును పారేసి పోలేవ్. చావు అప్పగింతలు ఓటిముంతలా చెప్పు! సరే! నాకు మళ్లా పె—ఎవరు వాకట్లో యెవరూ?

నౌకరు, మొహం లోపలికి చాపి 'పెద్దకాపుగారు వొచ్చారు' అని కబురుచెప్పాడు.

తాండవశాస్త్రి మొహం వికారంగా పెట్టి ఇలా అన్నాడు— 'అబ్బ! వీళ్లతో పడలేను, వ్యవహారాలూ వ్యాపారాలూ, ఎప్పుడూ పని పని. నా సంగతి యెవళ్లకు తెలుస్తుంది? నా కివంటే విషమయిపోయింది. వీళ్ల కెట్లా తెలిపేది? పరమేశ్వరా ఎప్పుడు దాటిస్తావో కదా? ఊఁ, నిల బడే వున్నావట్రా? పో! రమ్మని చెప్పు!'

నౌకరు అవలికి పోంగానే మీనాక్షికూడా లోపలికి వెళ్లి గొంతుక అణుచుకుని 'అల్లా అయితే మీ రీనా డేమీ పుచ్చుకో రన్నమాటేనా ?' అని అడిగింది.

తాండవశాస్త్రి తల ఆడించి 'ఉఁహుఁ. పుచ్చుకోను. నేడు శంకర జయంతి. ఇవ్వాళ పర్వం. చిన్నీ ! మావంటి ఆకాలపునాటి వాళ్లు కొందరిల్లా ఈ యాచారా లన్నీ పాటించుకుంటూ వస్తూండబట్టే ఆకాశాన సూర్యచంద్రులు పొడుస్తున్నారు, నీళ్లలో పాటుపోటులు కనిపిస్తున్నయ్. ఓ పరమేశ్వరా ఇదంతా నీయిచ్ఛే' అని అన్నాడు.

మీనాక్షి—'అదే పోనీండి కొంచెం గంగా పాలూ పుచ్చుకుంటే దోషం లేదు. నేను పాలు కాచుకొని సిద్ధంగా కనిపెట్టుకుంటాను, మీరు రండి' అని ఆమె తలుపు బిగించింది.

ఎదుటి గుమ్మంలోంచి నవుకరువెనకాత్తే ఒక పెద్దమనిషి లోపలికొచ్చాడు.

'రా ! రా ! రెడ్డెమ్మకాపూ ! కూచో ఇల్లా కూచో ! నీకోసం కళ్లు వాచుకున్నయ్ ! కొంచెం కబురయినా చెయ్యలేక పోయావా ? ఒకే అబద్ధాలూ ! నీవు తొందరగా లోపలికి పోయి పట్టాలో ఉంది శబరిలంక పొగాకు ! పది తుంపులు పట్టుకుని రెడ్డెమ్మకాపుకు—

రెడ్డెమ్మకాపు తాండవశాస్త్రికి సాష్టాంగపడి తివాచీ అంచున కూచుని మొందట నిట్టూర్చి అటుపిమ్మట—'అయిదువంద లొకచోట— మూడువంద లొకచోట,—ఈ యెనిమిదివందలూ ఓడ ఎక్కించి మరీ తమ దర్శనానికి వచ్చాను. అబ్బా ఎంత హంగామా, ఎంత హంగామా !' అని అన్నాడు.

దక్షిణ ఆఫ్రికాకు మేకలనూ గొర్రెలనూ ఎగుమతి చేసే రహస్య వ్యాపారంలో ఈ రెడ్డెమ్మకాపు తాండవశాస్త్రికి వాటాదారు. మూడు నెల

లలో 3వేల జీవాలు పంపే షరతులతో కాకితాలు రాసుకోవడం జరిగింది. కాబట్టి, రెడ్డెమ్మ కాపు ఎనిమిదివందలనే ఓ డెక్కించాడని చెప్పటంవల్ల తాండవశాస్త్రికి సంతుష్టి కలగలేదు. అతడు పెదవి విరిచి 'అన్నీ కలిపి ఎనిమిదివందలేనా? కంట్రాక్టు మూడు వేలకు గదా! అబ్బో ఇంకా చాలా పంపాలే' అని అన్నాడు.

రెడ్డెమ్మ కాపు కొంచెం కష్టంతో ఇల్లా అన్నాడు—'మేకలూ గొర్రెలూ ఇప్పుడు దొరుకుతున్నా యనుకున్నారా స్వామీ? అన్నీ యెగు మతి, యెగుమతి అయిపోతున్నయ్. ఈ యెనిమిదివందలూ జతపరిచేసరికీ తాళిక బయటికి వచ్చింది. అయినప్పటికీ ఫరవా లేదు. రామాపురంనుంచి అప్పన్న ఏ డెనిమిదిలోజుల్లో అయిందా రొందల జీవాలు రైలులో పంపిస్తా నని ఉత్తరం రాశాడు. మన పని కేవళంగా రైలులోంచి దింపి ఓడలో పడెయ్యడం. ఇంకా మూన్నెల్లు టైమ్ ఉందిగా! దేముడి దయ చల్లగా వుంటే అన్నీ సప్లయి అయిపోతియ్ లెండి!'

తాండవశాస్త్రి ఊరటపడి ఇల్లా అన్నాడు—'నీమీదే నా కాశ. నే నిప్పు డించుమించుగా గృహస్థసన్యాసిని. మావొదినెగారు పోయిం దగ్గిర్నుంచీ డబ్బూ దస్కమూ సంసారమూ సర్వమూ విషమై పోయయ్. కేవలం ఈ కుర్రవాడికోసం గాని—అయితే రూపాయికి రూపాయి లాభం వచ్చేట్టు కనబడటం లేదూ?

రెడ్డెమ్మ కాపు తల ఊపి—'తప్పకుండా వస్తుంది. కాని ఈమాటు అహమ్మద్ సాయబు డబ్బు కొట్టేస్తాడు. ఏ డొందలకు కంట్రాక్టు సంపా యించాడు. ఇంకా ఎక్కువ సంపాయించేవాడే కాని డబ్బు లేకపోబట్టి సాహసంమాత్రం చేయలేకపోయాడు.

తాండవశాస్త్రి కన్ను గిరిపి 'చాలా కావాలా యేమిటి' అని ప్రశ్నించాడు.

'ఔను. లేకపోతే నేను వొదులుకుంటాను లెండి' అని రెడ్డెమ్మ కాపన్నాడు.

తాండవశాస్త్రి ముక్కుమీద వేలేసుకుని 'రామరామ. పొద్దున్నే ఆమాట అనచ్చా కాపూ?' వాడు జాతికి మ్లేచ్ఛుడు. ధర్మాధర్మజ్ఞానం లేదు—అయితే పదివేలు లాభం కొట్టేస్తాడని కనబట్టం లేదూ?

'ఇంకా యెక్కువ ఇంకా యెక్కువ.'

'యుద్ధంగనక ఇంకా కొన్నాళ్లు జరిగితే పకీర్గల్లా పీరయ్యేట్టున్నాడు, ఔను కదూ?'

'అనుమానం లేదు. అయితే ఇది లక్ష్మితో చెలగాటం. ఒక్కసారి పోగుచేసేసరికి తాతలు దిగొస్తారు.'

'కంట్రాక్టు చూపించి నోటు రాస్తాడు. తాతలు దిగిరావలసినంత పనేముంది ఇందులో?'

రెడ్డెమ్మ తల ఊపుతూ ఊపుతూ 'ఔను, ఆమాట నిజమే, డబ్బు దొరికితేగా? నాకు చెప్పాడులెండి' అని అన్నాడు.

ఈమాట విని తాండవశాస్త్రి ఉత్సుకతతో 'నీతో చెప్పాడా? వడ్డీ ఎంతిస్తాడేమిటి?' అని అడిగాడు.

'రూపాయికి అణా! అయితే—'

తాండవశాస్త్రి ఈ అయితేను తుదముట్టనిచ్చాడు కాదు. కోపగించుకుని ఇల్లా అన్నాడు—'అణా! ఒక్కణా? రూపాయికి రూపాయి లాభం కొట్టి ఇహ వడ్డీ ఇవ్వొచ్చేటప్పుడు అణా? పదణాలు ఆ ప్రాంతంలో ఏమైనా ఇచ్చేట్టుంటే ఒకసారి కనబడమని చెప్పు.'

రెడ్డెమ్మ కాపుకు కొంచెం ఆశ్చర్యమే కలిగింది. కలిగి 'సాయబుకు మీరే పెట్టుబడి పెడతారాయేమిటి? కాని లోకులు వింటే—

తాండవశాస్త్రి ఒక్కనిమిషంలో తన స్థితిని చక్కబరుచుకుని కొంచెం శుష్కహాస్యం చేసి 'నారాయణ నారాయణ! నీకేం పిచ్చెత్తిందా రెడ్డెమ్మా! చేతనయితే వారిస్తాను. లోకులు వింటే' అని అన్నాడే ఈ సంగతిలో నీవూ మరి నేను. ఇహ బ్రహ్మరుద్రుడికి తెలియగూడదు. కాని ఈమాటకూడా విను, కావాలిస్తే అతనికి పెట్టుబడి పెట్టడంలో మోసకాటు లేదు. అతడు ఈడబ్బు తీసుకుని తండ్రికి శ్రాద్ధమే పెట్టుకోనీ, భోగమాటే ఆడించుకోనీ, ఆవులనే ఎగుమతి చేసుకోనీ. లోకుల కేం?' అని రెడ్డెమ్మ సమ్మతి పొందడానికి క్షణకాలం అతని మొహంకేసిచూస్తూ ఉండి, తానే మళ్లా 'అది కాదు రెడ్డెమ్మా! కేవలం ఇది మాటకు మాటగా చెప్పాను. కాని లోకులెవరూ ఇంత ఆరా పెట్టుకుని నెగ్గరు; అయితే నన్ను చాలా కాలంనుంచీ ఎరుగుదువుగదా, మాంచి బ్రాహ్మణ కులంలో పుట్టాను. ధర్మమార్గంలో ఉండి బిచ్చమెత్తుకుంటాను, అదే మేలు; కాని అధర్మంగా చిల్లిగవ్వైనా ఎన్నడూ అంటకుంటే చాలు. కేవలం శ్రీమన్నారాయణుని పాదారవిందాలలో చాలా కాలంనుంచీ మతిని కట్టేశాను కాబట్టే ఇప్పుడు అయిదూళ్లకు సభాపతి నయినాను. ఇప్పుడొక్కమాటతో బ్రాహ్మణ్ణి శూద్రుణ్ణిగానూ శూద్రుణ్ణి బ్రాహ్మణ్ణిగానూ చేసెయ్యగలను. నారాయణా! నీవే గతి! నీవే దిక్కు! వెనకాల నాకు పెద్దరోగం వచ్చిందే అప్పుడు జయరావు డాక్టరు సోడానీళ్లు తాగక వీలు లేదన్నాడు. అప్పుడు నేను—డాక్టరుగారూ! పుట్టాక చావక తప్పదు, అ దేమంత దొడ్డ సంగతి కాదు, కాని ఈమాట ఇంకో మాటు తాండవశాస్త్రి చెవికి తగలనీయకండి.' అని అన్నాను. రామసోమ యాజులవారి మనమణ్ని! జోగిచయనులవారి కుమారుణ్ని? నూజేటి జమీందార్లు పాదోదకంకోసం పల్లక్కీ బోయీలను పంపిస్తారే!'

రెడ్డెమ్మ రెండోసారి నమస్కారం చేసి లేచి నిలబడి—'స్వామీ ఈమాట కెవ రనంగీకారం చెప్పుతారు చెప్పండి!—ఊరూ నాడూ అంధ

రకూ తెలుసు?' అని అన్నాడు.

దీనికి ప్రత్యుత్తరంగా తాండవశాస్త్రి కేవలం ఒక దీర్ఘనిశ్వాసం వెలిపుచ్చి—'పరమేశ్వర ! నీవే దిక్కు' అని అన్నాడు.

రెడ్డెమ్మ కాపు వెళ్ళడాని కుపక్రమింపగానే తాండవశాస్త్రి అతన్ని వెనక్కి పిలిచి 'ఇదుగో అప్పన్నదగ్గర్నుంచి వస్తే, రైల్ ప్యాసు నాకో సారి చూపు' అని అన్నాడు.

రెడ్డెమ్మ తల ఊపి 'చిత్తం బాబయ్యా' అని అన్నాడు.

తాండవశాస్త్రి—'అల్లా అయితే, ఎనిమిదివందలు, మరి అయిదు వందలూ ! ఇహ పదిహేడువందలు కావాలి. ఇంకా మూడునెల్లు అవ కాశం ఉంది. పోగడతయ్యా ? ఏమంటావ్ ?' అని అన్నాడు.

రెడ్డెమ్మ 'చిత్తం బాబయ్యా పోగడ కేం లెండి' అని అన్నాడు.

తాండవశాస్త్రి 'అందుకనే అప్పుడే నీకు చెప్పా. రెడ్డెమ్మా ! అయిదువేలకు ఒకటేసారి కంతరాట్లు రాసేయవోయని. అయితే నీకు సాహసం లేకపోయెను' అని అన్నాడు.

రెడ్డెమ్మ ఇల్లా అన్నాడు: 'చిత్తం, అన్ని గొర్రెలూ మేకలూ దొరక్కపోతే—

తాండవశాస్త్రి ప్రతివాదం చేయులేదు. 'సరే మంచిది, సరే మంచిది' అని, 'ధర్మమార్గంలో ఒకటికి సగమే కానీ, సగానికి ఇంకా సగమే కానీ అదే ఎక్కువ. కాని అధర్మమార్గంలో రూపాయకి రెండూ గిట్టినా అది మంచిది కాదు. రెడ్డెమ్మ కాపూ తెలిసిందా ? నారా యణా ! నీవే శరణు' అని అన్నాడు.

రెడ్డెమ్మ కాపు మరి మాటాడక వెళ్లిపోంగా భగవద్భక్తుడున్నూ గృహస్థ సన్యాసియున్నూ అయిన తాండవశాస్త్రి పాడుంటట్లాకటి

పట్టి ఏదో ఆలోచిస్తూ మెల్లిమెల్లిగా ఒక్క దమ్ము వేశాడు. విష యాలంటే బహుశా అతనికి విషంలాగానే కనబడడం మొదలుపెట్టి ఉంట యి. కాని అటువంటి సమయంలో లోపలి తలుపు తెఱుచుకుని దాసీది మొహం ఇవతలికి పెట్టి 'చిన్నమ్మగారు మిమ్మల్ని ఒకసారి లోపలికి రా మన్నారు' అని అన్నది.

తాండవశాస్త్రి చకితుడై 'ఎందుకో చెప్పవూ సత్తీ?' అని అన్నాడు.

'చిన్నమ్మగారు పాలు కాగబెట్టుకుని తమకోసం కనిపెట్టు కూర్చు కుంటారు'

తాండవశాస్త్రి బంగారు పన్ను చేసిన పొడుంకాయ రొండిని దోపి కొంచెం నవ్వి—'మీ చిన్నమ్మగారితో నేను వేగలేనే సత్తీ! పర్వదినంకదా ఒకపూట ఉపవాస ముందాం మనుకుంటే ఆమె సహించే టట్టు లేదు!' అని లేచి నించుని వెళ్తూ వెళ్తూ నిట్టూర్చి 'సంసారంలో ఉండి పరకాలంకోసం రెండు మంచి పను లేమయినా చేసుకు పోదా మనుకుంటే దాని కెన్నయినా విఘ్నాలు! హరి హరి! నారాయణ నారా యణ!' అని అనుకుంటూ వెళ్ళాడు.

## ४

కొన్నాళ్లనుంచీ సంధ్య ఆరోగ్యం తిన్నగా నడవడం లేదు. ఎప్పుడూ జర్వం ఉంటూ ఉంటుంది. తండ్రి చికిత్సలో ఉండి క్రమక్రమంగా నీరసస్థితిలోకే పోతూంది. 'విస్సన్నను పిలిపిస్తా' నని తల్లి రోజురోజూ భయపెటుతూంది. ఇందునుగురించి ప్రతిదినమూ తల్లిబిడ్డలలో చిటిపొటి కలహం చెలరేగుతూంది. ఈ సాయంకాలం సంధ్య ఒక పీట కానుకుని కళ్లు మూసుకుని తల్లిఇచ్చిన సగ్గుజావ గుటగుట తాగి గబగబా ఒక తామల పాకు నోట్లో కుక్కుకొని ఎల్లాగో ఒకల్లా డోకు రాకుండా చేసుకుంది.

పగ్గుజావకూ సంధ్యకూ పగ. మెరుక! అలా అయినప్పటికీ ,నీవు తాగ లేదేం? ఇంత కొద్దిగానే తాగావేం?' అనే ఈలాటి కల్పనలతో జరుగ వలసిన జగడాని కవకాశం ఇవ్వలేదు. తల్లి ఎక్కణ్ణుంచో తనను కని పెటుతూనే ఉంటుందని ఆమెకు తెలుసు. సంధ్య ఒళ్లో తెరిచిన పుస్తక మొకటి పడివుంది. జావ తాగకముందు సంధ్య దాన్ని చూస్తూంది కాబోలు. జావ తాగింతర్వాత గ్రంధం తీసుకుని మనస్సును దానిమీద లగింపజేసేటంతట్లో ,ఎక్కడున్నావమ్మా అత్తా' అనే పిలుపు ముంగిట్లో వినబడింది.

ఇంట్లోకి ఆవచ్చినవాడు వసుఖం. అతని వేషమూ, చెహరా చూస్తే ఎక్కణ్ణుంచో ఇప్పుడే వచ్చినట్లు కనబడుతూంది.

పాలిపోయివున్న సంధ్య మొహంమీద ఒక యెర్రడాలు క్షణ కాలం కనబడి మాయమైపోయింది. సంధ్య కళ్ళెత్తి నవ్వుమొహంతో ,చెన్నపట్నంనుంచి ఇప్పుడే వచ్చినట్లున్నది' అని అన్నది.

వసుఖం దగ్గిరకొచ్చి ఆశ్చర్యపడి ఇలా అన్నాడు— ,అవును కాని ఇంత చిక్కిపోయావేం? మళ్లా జ్వరమా యేమిటి?'

,అటువంటిదే యేదో ఒకటయ్యేవుంటుంది. అయితే నీ పోలెం కూడా దానికి భిన్నంగా కనపడడంలేదే?'

వసుఖం నవ్వి— ,పోలెం చేసుకున్న అపరాధ మేమిటి? పొద్దుట్నుంచీ ఇంతవరకూ స్నానం లేదు తిండి లేదు. నీవు పురమాయించిన మాదిరీలకోసం తిరిగీతిరిగీ కాళ్లు పడ్డయ్. ఇయ్యిగో తీసుకో, అని జేబు లోంచి ఒక కాకితపుచుట్ట బయటికి తీసి సంధ్య చేతిలో పెట్టి ,అత్తేదీ?, మామగారు ప్రాక్టీసుకు బయలుదేరారుకాబోసు! గత శనివారం ఎంత కొట్టుకున్నా ఇంటికి రాలేకపోయా, అందువల్ల ఇవి పట్రావడానికి ఆలస్య మైపోయింది. పిట్ట లల్లుతావా?, నేవతల నల్లుతావా? లేక గలాబీ—

‘అవన్నీ ఆలోచించడానికి చాలా అవకాశం వుంది. ఇవి పట్రాడానికి వారంరోజు లాలస్య మయితే ఇక కుట్టడానికీ పెట్టుకోడానికీ కొన్ని గంటల ఆలస్యం సహించడానికి వీలు లేదూ? స్టేషన్ నుంచి ఇంటికెళ్లకుండా ఇక్కడి కొచ్చా వెందుకూ?’

వరుఖలు నవ్వుతూ ఇల్లా అన్నాడు— ‘స్నానభోజనాలకుగద! అవన్నీ సంధ్య— అయింతర్వాతనే. సరేకాని చీటికీమాటికీ నీ కీ అనారోగ్య మేమిటి చెప్పు!’

ఆతని ఈ ‘సంధ్య’ లో ప్రచ్ఛన్నంగా ఉన్న కటాక్షం, కర్ణమూలానికి తగిలి కొంచెం ఎరుపెక్కించిందిగాని సంధ్య దాన్ని లక్ష్యం చేయనట్లే నటించి, కోపంగా ‘దానికిమాత్రం ఇహ ఏమంత ఆలస్యం ఉంది? సరే పద! వృథాగా ఆలస్యం చేయక!’ అని అన్నది.

వరుఖలు ప్రత్యుత్తరంగా మళ్ళా నవ్వి ఏదో చెప్పబోతూవుండంగా జగదంబ అక్కడికి వచ్చింది. జగదంబ మొహం చూసేసరికీ వరుఖలు నోట్లో మాట నోట్లోనే ఆగిపోయింది. జగదంబ కోపంతో మొహంఅంతా. మసి చేసుకుని ఇంట్లోంచి అక్కడికి వచ్చింది. వచ్చి కూతుర్ని చూచి ‘ఇహ ఆ తామలపాకు నములకు సంధ్యా! దాన్ని ఉమ్మేసి నీయిష్టం వొచ్చినట్లు సరసా లాడుకో’ అని ఆ యిద్దరిలో ఎవరినిగాని చూడకుండానే ఇంట్లోకి వెళిపోయింది.

గభాలున ఏదో కాండ జరిగిపోయిన ట్లయింది. వరుఖలు పిడుగు పడ్డట్లయిపోయాడు. సంధ్య వెలవెల పోయింది. మాపటింతల ఆకాశంలో కాంతంతా మాయమయిపోయినట్లుంది కొంతసేపు. కొంచెంసే పిట్లా వుండి, సంధ్య నోట్లోవున్న తామలపా కుమ్మేసి, రోదనస్వరంతో ‘నీవు ఈయింట్లో మళ్ళా అడుగుపెటతా వెందుకూ? మమ్మన్ని సంపూర్ణంగా నాశనం చేసిగాని విడిచిపెట్ట దలచుకోలేదా?’ అని అన్నది.

వరుఖులు మెట్టమొందటనయితే ఒక్కమాటయినా మాటాడలేక పోయాడు. తరువాత తరువాత తేలుకొని 'సంధ్యా! నేను నీకు నిజంగా అంటరానివాణ్ణా; నోట్లో తామలపాకు మన్మేశావ్ ?' అని అన్నాడు.

సంధ్య హఠాత్తుగా ఏడ్చేసి 'నీకు జాతి లేదు, మతం లేదు,— నీవు నన్నెందుకు ముట్టుకున్నావ్ ?' అని అన్నది.

'నాకు జాతి మతాలు లేవూ ?'

'లేవు, లేనేలేవు. నీవు సీమకు వెళ్ళావ్— మ్లేచ్ఛుడవయిపోయావ్. అనాడు నీకు మా అమ్మ ఇత్తడి చెంబుతో మంచినీళ్లిచ్చింది. గుర్తు లేదూ ?'

వరుఖులు దీర్ఘంగా నిశ్వసించి 'లేదు, నాకు గుర్తు లేదు. అయితే నేను నీకిప్పుడు అస్పృశ్యుణ్ణి మ్లేచ్ఛుణ్ణి.'

సంధ్య కళ్లు తుడుచుకుని— 'నాకే కాదు, నీ వందరికీ అస్పృశ్యుడవు, మ్లేచ్ఛుడవు. ఇప్పటినుంచే కాదు, నీ వెవ్వరిమాటా చెవి పెట్టకుండా ఎప్పుడయితే సీమకు వెళ్ళావో అప్పట్నుంచీ' అని అన్నది.

వరుఖులు,— కాని నేను నా మనస్సులో మాత్రం—

వరుఖులు తన మనస్సులోమాత్రం ఏ మనుకున్నాడో అది చెప్పలేక పోయాడు. నిమిషం మాత్రం నిశ్చలంగా ఉండి 'నే నిహ బహుశా మీ యింటికిమాత్రం రానుగాని, నే నంటే గోతపడకు! గోత కలిగించే పని నే నెన్నడూ చేసివుండలేదు.' అని అన్నాడు.

'నీ కాకలి దప్పులు రెండూ లేవూ ? ఊరికే నుంచుని నుంచుని వాతో జగడం పెట్టకోవడమే నీకు పనా ?'

'కాదు. నేను జగడమాడను. నన్ను అసహ్యించుకొనేవాళ్లతో ముఖాముఖీగా నిలబడి పోట్లాడేటంత నీచుణ్ణి కాను నేను.' అని వరుఖులు

మెల్లమెల్లిగా వాకిట్లో కెళ్లిపోయాడు. సంధ్య అతడు పోయిన దారే చూస్తూ పాషాణప్రతిమల్లే నిలబడిపోయింది.

తల్లి కూతురియెదుటికి వచ్చి ప్రసన్నముఖంతో ఇల్లా అంది— ‹పోనీ, మళ్లా ఇహ ఇక్కడ కాలుపెట్ట దనుకుంటాను' అని అన్నది.

సంధ్య చకితయై ‹రాడు' అని అన్నది.

‹వృథాగా అతణ్ణి ముట్టుకున్నావ్, బట్ట వొదిలెయ్!'

తల్లిమొహం చూచి సంధ్య ‹బట్ట దగ్గర్నుంచీ వొదిలెయ్యాలా?' అని అడిగింది. వాడిపోయిన కూతురు ముఖచ్ఛాయ తల్లికంట పడలేదు. ఆవిడె ఆశ్చర్యంగా ‹వొది లెయ్యక్కర్లా? కిరస్తానీవాడు,—విధవగాలు గాని సధవరాలుగాని అయితే తలారా స్నానం చేయాల్సి వచ్చేది. ఆనాడు పేరిమ్మత్త,—కొంచెం బడాయ్ చూపిందిలే,—చూపినా ఆమె దగ్గిర ఆచారసంపత్తి సేర్చుకోవాలిసిందే. ఉప్పరిది కొంచెం తగిలిందో లేదో ఆపళంగా మనమరాలిని పొద్దూకేవేళ చెరువులో ముంచిమరీ ఇంట్లోకి తీసుకొచ్చింది.' అని అన్నది.

‹భేష్ బాగుందమ్మా! అలాగే చేస్తాలే' అని సంధ్య అన్నది.

తల్లి తల తిప్పి బ్రాహ్మల ఆచారవిచారాలగురించి ఇంకేమేమో ఉపదేశింపబోతూంది. కాని అంతలో వెనుకనుండి ‹జగదంబా! ఇంట్లో ఉన్నావటమ్మా?' అని పిలుపు వినబడ్డది.

తాండవశాస్త్రిగారు ఏకంగా సావిట్లోకి వచ్చి నిలబడ్డారు. జగదంబ వెనక్కి తిరిగి చూచి ‹ఎంత భాగ్యం! శాస్త్రులు మామే! రాండి రాండి' అని అన్నది. కాని ఆనాడు పేరమ్మకూ తన కూతురుకూ జరిగిన సంభాషణ గుర్తు వచ్చింది. జగదంబమొహం ఎండిపోయింది.

సంధ్య లేచి నిలబడింది. తాండవశాస్త్రి తల్లికి ప్రత్యుత్తరం

చెప్పటం మానేసి కూతురుకేసి తిరిగి నవ్వుతూ ‘సంధ్యా ! ఎట్లా ఉన్నావో చెప్పవేం ? ఇదేమిటి, జబ్బుపడ్డట్లున్నావ్?’ అని అన్నాడు.

‘జబ్బూ లేదు గిబ్బూ లేదు, బాగానే వున్నాను తాతా’ అని సంధ్య అన్నది.

దుఃఖముఖంలోకి కొంచెం నవ్వు రప్పించుకుని జగదంబ ‘ఆ, బాగానే వుందిట బాగా !’ నెలరోజులనుంచీ మామా ! రోజూ తలనొప్పి రోజూ జ్వరమే. ఇప్పుడేగా జావతాగి కూచుంటూ, అని అన్నది.

తాండవశాస్త్రి ‘అల్లాగా ? అయినా ఎందుకు జబ్బుచేయకుండా ఉంటుంది ? మీరు దీన్ని ఇంట్లో కట్టేసుంచారు. కాని లేకపోతే ఒళ్లోనూ మెళ్లోనూ ఇంతింతలూ అంతింతలూ పిల్లలను వేసుకుని ఎక్కడో సంసారం చేస్తూఉండేది. ఒకయ్యచేతిలో ఇంకా ఎప్పుడు పెడతారు ? వయస్సు వస్తే——

వయస్సుమాట గబగబా తొక్కిపెట్టి జగదంబ ఇల్లా అంది—— ‘ఏం చేస్తా మామా ! నే నొక్కత్తెను, ఆడదాన్ని, ఎన్నివైపులని చూసు కోను ? ఆయన పట్టించుకోనే పట్టించుకోరు,——కోతికి కొబ్బరికాయ దొరికిన ట్లే వైద్యమొకటి దొరికింది, ఎప్పుడూ దానితోనే కిందట్లు మీదట్లు ——ఇల్లూ వాకిలీ వొదిలేసి కాశీకి పరిగెత్తి మా అత్తగారిదగ్గిర ఉండి పోదా మన్నంత అపహ్నం పుట్టుతూంది మామా నాకు. నేను పోయిం తర్వాత ఎవరి గీ తెల్లా ఉంటే అల్లా జరుగుతుంది.’ అని యిల్లా చెబుతూ వుండగా జగదంబ కంఠస్వరం గద్గదమవుతూ వచ్చింది.

‘ఈ పిచ్చివా డింకా ఏంచేస్తూ కూచున్నాడు ?’ అని తాండవ శాస్త్రి అడిగాడు.

‘ఇది అసలు పిచ్చయినా నేను బతికిపోయేదాన్ని. ఇంటో కూలేసి తలుపులకు గొళ్ళాలు బిగించేదాన్ని. నన్ను లోపలా బయటా కాల్చి

భస్మంచేసి పారేస్తున్నారు' అని జగదంబ నేత్రకోణాలు వస్త్రాంచలంతో తుడిచేసుకుంది.

తాండవశాస్త్రి సానుభూతిస్వరంతో ఇల్లా అన్నాడు. —'నిజమే పాపం నిజమే,—నేనూ చాలాచాలా విన్నాను. అదల్లా వుండంగా, మీరుకూడా, బాబో, విల్లు విరవడం, ఉంకువగా పెట్టుకున్నారట, సాక్షాత్తు కుమారస్వామికిగాని పిల్ల నివ్వమంటున్నారట! మనబోటి గొప్ప కులపు ఇళ్లల్లో ఇటువంటి వెప్పడైనా జరుగుతయ్యా జరిగెయ్యా అమ్మాయీ? ఆరోజుల్లో ఎంత కులీనులైనాసరే గంగాయాత్ర చేయందే కుల రక్షణం ఉండేదా? పరమేశ్వర! నీవే సత్యం. ఈసంగతి నీవుమాత్రం ఎరగవా?'

జగదంబ కలవరపడి ఇల్లా అంది: 'నా అల్లుడు నెమలి నెక్కి రాందే పిల్ల నియ్యనన్నా నని నీ కెవరు చెప్పారు మామా? పిల్ల ముంగా కులం ముందా? చుట్టాలు కాలుస్తారని నియోగులయింట్లో మా వంశంవా ళ్లెవళ్ళూ కాలుపెట్టరే అట్టి వంశపువారి ఆడుబడుచును నేను కుమారస్వామి దిగి రావాలని కూచుంటానా? కుర్రదాన్ని ఏట్లోనైనా పారేస్తాగాని కులం తక్కువవాళ్లకుమాత్రం ఇవ్వకూడ దనే నా పట్టుదల.

తాండవశాస్త్రి—'అల్లా చెప్పు సంగతి, అదా కథ? మంచిది. నేను చూచి పెటతాను లే' అని అన్నాడు.

'ఈ మాట విని వెళదాం, ఈమాట విని వెళదా' మని అనుకుంటూ సంధ్య తల వంచుకుని ఎర్రబారినమొహంతో నిలుచుంది. తాండవశాస్త్రి సంధ్యకేసి చూచి నవ్వుతూ రహస్యంచేసి ఇల్లా అన్నాడు 'జగదంబా! నీవు కుమారస్వామి దిగి రావక్కర్లేకపోతే పిల్లను నా చేతుల్లోనే పెట్టరాదూ? వరసావావీకూడా బాధించదు. రాజా రాణీలాగా కూడా ఉంటాం. ఏమంటావ్ మనమరాలా పసందుగా ఉంటుందా?'

మరో మరో సమయం అయివుంటే సంధ్యకూడా పరిహాసంలో పాలు పుచ్చుకునేదే కాని వరుసులందగ్గిర్నుంచీ ప్రసంగం తండ్రిదాకా డేక డంవల్ల క్రోధంచే దుఃఖంచే సిగ్గుచే ఉడికిపోయి మొహమెత్తి ప్రసం డెం చుకు కాకుండా ఉంటుంది తాతా? సప్తకట్ల సవారీలో మీ రీదారినే దయచేస్తే నేను పూలమాల పుచ్చుకుని తయారుగా ఉంటా'నని కఠినంగా జవాబు చెప్పి వడివడిగా దొడ్డిగుమ్మంలోంచి వెలుపలికి వెళ్లిపోయింది.

సంధ్య భయంకరమయిన కోపంతో వెళ్లిపోయినట్లు విస్పష్టం. వ్యర్థ మయిన పరిహాసంచేతా తీవ్రమయిన ఈ నిందచేతా తాండవశాస్త్రికి మొ దట మాటరాకుండా అయిపోయింది.

తరువాత అహ్హాహ్హా అని వెర్రినవ్వు నవ్వి 'తస్సాగొయ్యా, పిల్ల కాదే పైల్వాన్. ఐతే తాతా మనమరాలి వరసలే,—అంటే అనచ్చు,—ఐతే, నోటికెంతొస్తే అంతా అనేస్తుందని ఆనాడు పేరమ్మ చెప్పగా విన్నాను లే. తల్లి దండ్రులనుగూడా లెక్కపెట్టేట్టు లేదే' అని అన్నాడు.

తుద కిల్లా పర్యవసిస్తుందని జగదంబ మొదటినుంచీ భయపడుతూనే వుంది. కాని పరియాచకంలో పడి ఈ అమంగళం ఈసారిమాత్రం ఎగిరి పోవచ్చు నని ప్రసంగమధ్యంలో ఆశించింది. బహుశా ఈ అమంగళం తప్పికూడా పోయేదే కాని యీకూతురు నిరర్థకంగా దబ్బకొట్టి పుట్టలో పామును పైకి తీసుకొచ్చింది. దీనితో జగదంబకు కూతురుమీద కలిగిన కోత కంతు లేకుండా పోయింది. కాని పై కేమీపాక్క్రక బహువినయం గా ఇల్లా అంది. 'లేదు మామా! ఆనాడు సంధ్య ఆమాటలన్నీ అనలేదు. పేరమ్మత్త కాసంతుంటే గంపంత చేస్తుంది. ఆసంగతి నీకూ బాగా తెలుసు.'

'నాకూ తెలుసు గాని నాదగ్గర చెయ్యదు.'

‘నే నప్పుడెమరుగానే ఉన్నా మామా.’

తాండవశాస్త్రి నవ్వి— ‘అలాగయితే అంతకన్న బాగా వుంది. అదుపుకూడా చేయలేకపోయా వన్న మాట’ అని అన్నాడు.

తాండవశాస్త్రి నవ్వుచేత జగదంబ మనస్సులో కొంచెం బలం వచ్చింది. వచ్చి, క్రోధంతో— ‘అదుపా? నీవు చూస్తూండు మామా దీన్ని శిక్షిస్తాను’ అని అన్నది.

తాండవశాస్త్రి స్నేహం చూపుతూ ‘శిక్ష కాదు చేయాలిసింది, పెళ్లి,— అదిగనక అయి సంసారం నెత్తిమీద పడితే వాళ్లకే తెలుస్తుంది. అయినప్పటికీ కొంచెం అదుపులో ఉంచటం మంచిది. కాలం చాలా భయంకర మయింది సుమీ! వఝులు ఇంకా వస్తున్నాడా?’ అని అన్నాడు.

జగదంబ భయపడి అబద్ధ మాడేసింది— ‘వఝులా? ఉఁ. హుఁ.’

‘మంచిదే. ఆ వెధవని రానీయకండి, నానా మాటలూ వింటున్నాను గాని’

చిన్నప్పటినుంచీ సంధ్య వఝులును బావా అని పిలుస్తుంది. అతడు సీమకు వెళ్లేటంతవరకూ ఈ యిరువురకూ చాలా దోస్తం ఉంది. అయినా అత నిప్పుడు సీమనుంచి దిగాడు. అతణ్ని అంటరాదు, ముట్టరాదు. వెలి. కాబట్టి వీళ్ల చెలిమి ఏఆకారంచేతగానీ రూపాంతరం పొందుతుం దని జగదంబ కలలోనయినా అనుకోలేదు. కాని కొన్నాళ్లనుంచీ సంధ్య చేసే చేతలలోనూ అనే మాటలలోనూ నడుమనడుమ ఒకానొకమంట పుట్టుకొస్తూంది. కళ్లు మూసుకున్నా దాని కాంతి కనిపిస్తూంది. కాని ఇది ఎంత ముదిరినా దీన్ని పురస్కరించుకుని భయపడవలసినంత పని ఈదినుసులో ఏమీ లేదని ఆమెకు నమ్మకం. కాని ఇప్పుడట్టి సూచనను స్పష్టంగా ఇతరులవల్ల విని

ఆమె ధైర్యం ఆపుకోలేక 'వింటే ఎన్నోమాటలు వినబడవచ్చు మామా! కాని నాకూతురునుగురించి లోకుల కింత శిరోవ్యథ యెందుకు చెప్మా' అని అన్నది.

తాండవశాస్త్రి మృదుహాస్యం చేసి ధీరతతో ఇలా అన్నాడు: 'ఆమాట నిజమే జగదంబా! కాని సరియైన సమయంలో జాగర్త తీసుకోకపోతే లోకం మూయటానికి మూకుడుండదు మరి!

జగదంబ ఈమాటక్కూడా ఏదో ప్రత్యుత్తరం చెప్పబోతూంది కాని సరిగ్గా ఆసమయంలోనే సంధ్య చేసి వచ్చిన పని చూచి భయ విస్మయక్రోధాలతో మాట్లాడలేకుండా పోయింది. సంధ్య చెర్లో స్నానం చేసి ఇంటోకి వస్తూంది, గుడ్డలు తడివి, వేణీభారంలోంచి జలధార పడుతూంది, తుడుచుకోడాని కింకా అవకాశం కలగలేదు,—ఈ అవస్థలో పక్కగా తప్పుకుని వడివడిగా దొడ్డోకి వెళిపోయింది.

'దీనికి జ్వరం వస్తూం దని చెప్పావ్‌గా! సాయంకాలం స్నానం చేసిం దేమిటి చెప్మా' అని తాండవశాస్త్రి అడిగాడు.

'నా కేం తెలీదు మామా' అనిమాత్రం జగదంబ సమాధానం చెప్పిందికాని వరుసలను తా నవమానించినందులకుగాను ఇది గూఢంగానూ చాలా కఠోరంగానూ కసి తీర్చుకోవడ మని లోలోపల ఆమెకు నిశ్చయంగా తెలుసు.

'ఈలాగా అపథ్యాలు చేస్తే రోగాన్ని పెంచుకోవడం కాదూ?'

'పెంచుకుంటే నే నేం చేసేది మామా? అది నామాట వినదు.'

తాండవశాస్త్రి తల తిప్పుతూ తిప్పుతూ 'ఆసంగతి అర్థమయింది, మంచిది సరేకాని నేనొకటి అడుగుతా చెప్పు,—ఈయింటికి యజమాని యెవరు? నీవా? ఇంటల్లుడా? లేక నీ కూతురా?' అని అన్నాడు.

'నేను తప్ప ఈయింటి కంధరూ యజమాన్లే.'

'అలాగయితే వాళ్లతో ఇల్లా చెప్పు—నాళ్లనడుమ ఉప్పర్లను బొమ్మర్లను ఉంచడం కుదరదు. వా రేదో ఒకయేర్పాటు చేయకపోతే చివరకు నేనే కలుంగజేసుకోవలసి వస్తుంది. పరమేశ్వరా నీవే నాకు ప్రాపు.'

దీనికి ప్రత్యుత్తరస్వరూపంగా జగదంబ 'సంధ్యా! ఇటురా' అని మహాకోపంతో పిలిచింది. సంధ్య వంటింట్లో తల తుడుచుకుంటూందేమో మొహం కొంచెం ఇవింటా జాపి 'ఎందుకమ్మా' అని అన్నది.

'ఈ ఉప్పరముండలను రే పెక్కడికయినా లేచిపొమ్మంటావా లేక స్నానం చేయబోయేముందు చీపురుకట్టొకటి తీసుకొని తన్ని తగిలేయ మంటావా ?'

'అనాధలను ఇద్దరాడవాళ్లను చీపురుతో కొట్టడం అంత గొప్ప పని కాదమ్మా! కాని వీళ్లెవళ్లకేనా ఏమేనా హాని చేశారా ?'

ఈమాటలకు తాండవశాస్త్రి ఇల్లా జవాబు చెప్పాడు—'నిన్న నే నాదారిని పోతూ చూశాను దారిమధ్య కూచుని వీళ్లు మేకలకు గంజి పోస్తున్నారు. దా రంతా మాలకూడు' అని అతడు జగదంబకేసి చూచాడు.

జగదంబ వెంటనే సమర్థిస్తూ 'దారంతా పడదా మామా' అని అంది.

'అలా చెప్పు! తెలియక విషం తాగచ్చుగాని తెలిసింతరువాత ?' అని తాండవశాస్త్రి సంధ్యకేసి చూచి నవ్వి ఇలా అన్నాడు— 'నీది లేత వయస్సు, నీవు రాత్రిరయినా స్నానం చేయగలవుగాని నేనుమాత్రం చేయ లేను సుమా.'

పొంగి పొరలుకొస్తున్న క్రోధాన్ని ఎల్లాగో ఆపుగుని సంధ్య ఇల్లా అన్నది—'తాతా ఆ సంగతి నాకు తెలుసు. మా నాన్నగారు వీళ్లకు

చో టిచ్చారు. ఇంకో చోటు చూపకుండానే వీళ్ల కవమానం చేయడానికి నే నొప్పుకోను.'

మానము అవమానము మొదలయిన పెద్దమాటలు కూతురునోట్లోంచి రాంగానే కోపంచేత తలి మొహంలోంచి మాటలు రాలేదు. కాని తాండవశాస్త్రి అందుకుని, 'అలా గయితే మంచిదే కాని చోటుకేం? దానికి మాత్రం లోటేం? వర్ఘులు ఇంటివెనకాల కావలసినంత చోటుంది. కొంచెం చోటియ్యమని అతణ్ణే అడగరాదూ? ఉప్పర్లయినా సొప్పర్లయినా వీళ్లు హిందువులు,—వీళ్లవల్ల అతని కులం పోదు' అని అతడు జగదంబను పరకాయించి మెల్లమెల్లగా నవ్వడం మొదలు పెట్టాడు. అతని మాటలలో జగదంబ రసం ఎంత ఎక్కువగా గ్రహించినప్పటికీ వర్ఘులు మాట వచ్చిపడడంచే ఎవరితో ఎల్లా మాట్లాడాలో ఏమో తెలియని ఈ కూతురు ఏమి కటువాక్యం ప్రయోగిస్తుందో అని ఆమె భయానికీ ఉత్కంఠకూ అవధి లేకుండాపోయింది.

సరిగ్గా అట్లాగే జరిగింది. సంధ్యకంఠస్వరంలో పరిహాస తారళ్యం పొంగిపొరలింది కాని ఆమాట లెంత నిశితాలో అంత కఠినాలు. సంధ్య ఇల్లా అంది—'కులం పోతే పోయె, దాని జమెంత దాని ఖర్చెంత? కులాన్నే లెక్కపెట్టని వాళ్లకు ఇహ కులం పోవడమూను, ఉండడమూనా?'

తాండవశాస్త్రి నవ్వడానికి ప్రయత్నించాడు కాని అతని మొహం నల్లగా అయిపోయింది. 'నీతో బహుశా అత డీమాట లన్నీ చెబుతూ ఉంటాడు కాబోసునేం?' అని అన్నాడు.

సంధ్య కిలకిల నవ్వేసి—'భేష్ తాతా! మిమ్మన్ని అతడు కుక్కలకిందా పిల్లులకిందా జమ కట్తాడు. ఇహ నేనో లెక్కా నాతో ఈమాటలన్నీ చెబుతుండడానికి? ఏనుగులే కొట్టుకుపోతే ఇహ

దోమలా ?' అని ఇహ వాదప్రతివాదాల కవకాశంకూడా చేయక గబుక్కున గదిలోకిపోయి కూచుంది.

జగదంబ ఇహ ఆగలేక,— చీ చీ అభాగ్యురాలా ! పరాయి కుర్రాడిమీద మిథ్యాపవాదం ఎందుకు వేస్తావ్ ? అతణ్ణెవ రెరగరు ? అత డెప్పుడూ ఈమాట లాడలేదు. నేను గంగలో నిలబడి ప్రమాణం చేస్తా' అని గద్దించి పలికింది.

గదిలోంచి జవాబేమీ రాలేదు. తాండవశాస్త్రి 'జగదంబా ! ఈ కాలపు పిల్లలందరూ ఇదే వరస. కుర్రాళ్ళమూ పిల్లలమూ అయితే ఐనాం కాని ఒకమాట నీకు ఇప్పుడు చెప్పిపోతున్నా, పిల్లపెండ్లి ఇహ ఆపకు. ఎక్కడో క్కడ ముడిపెట్టి పాపక్షాళనం చేసుకో,—పాపక్షాళనం చేసుకో !' అని అన్నాడు.

జగదంబ ఏడ్చేసి ఇలా అన్నది : 'ఏదయినా సంబంధం చూసిపెట్టు మామా ! నేను చూసుకోలేకుండా వున్నాను.'

తాండవశాస్త్రి తల ఊపుతూ ఊపుతూ 'మంచిది చూస్తాలే. కాని ఒక్కమాట. నీకున్న చిన్న దొక్కత్తె. దూరసంబంధం చేసి భరించడం కష్టం. బెంగపడి పోవలసివస్తుంది. మనబోటి వారియిళ్లల్లో వరుడి వయస్సుమీద భ్రమ పెట్టుకోరాదు. మరేమిటూ పిల్లగనక దగ్గర పడుంటే రెండుపూటలా కంటి కగుపడుతుంటుంది. అంతకంటే సుఖం ఏముంది ?' అని అన్నాడు.

జగదంబ కళ్లు తుడుచుకుని కరుణకంఠంతో ఇలా అంది—'ఇంత పుణ్యం నా కెట్లా లభిస్తుంది మామా ? కాని ఎవరయినా ఇంటల్లుడుగా—

తాండవశాస్త్రి జగదంబమాట సాగనీయకుండానే ఇలా అన్నాడు— 'ఎబ్బె ఎబ్బె ! అటువంటిమాట అనవైనా అనబోకు, ఇల్లరికానికి ఇది

కాలం కాదు. దానివల్ల చాలా నింద లొస్తయ్. ఎవడైనా ఒక పప్పు భొట్లను పట్టుకొస్తావనుకో, వాడు గంజాయీ నల్లమందూ మొదలెట్టి నీ ఆస్తి యావత్తూ ఊదేస్తాడు. నీసంగతే కొంచెం వెనకా ముందూ పారజూచుకో రాదా అంట.'

ఈమాటలో ప్రచ్ఛన్నంగా ఉన్న విషయం గ్రహించి జగదంబ ఒక్క చిటికలో ఉత్తేజనం పొందిపోయి, 'చాలాకాలంనుంచీ చూచు కుంటూ వస్తున్నా మామా చాలాకాలంనుంచే చూచుకుంటూ వస్తున్నా, లోలోపలనే మాడి మసై పోతున్నా' అని అంది.

మృదు హాస్యం చేసి తాండవశాస్త్రి 'అల్లా అను. పని పాట లేకుండా ఊరికే కూచుని తింటే ఇల్లా అవుతుంది. నీయఘమంటి బుద్ధి మంతురా లీపాటి తెలుసుకో లేదూ?' అని అన్నాడు.

జగదంబ ఈ మాటకు ఉబ్బి 'తెలుసుకోకేమి మామా! లోపల్లో పల నా కంథా తెలుసు. కాని నే నాదదాన్ని. ఎటువెంపు చూసినా దరీ దాపూ కనబడదం లేదు' అని అంది.

తాండవశాస్త్రి ఆసరా ఇస్తూ ఇలా అన్నాడు— 'కనబడుతుంది కనబడుతుంది, తొందర రెందుగ్గాని,— కొంచెం ఆలోచించి చెప్తాలే, సంధ్యాకాలం అయిపోయింది ఈపాటికి పోయొస్తా.'

'మామా! ఇందనుకా నిలబడే ఉన్నావ్, కొంచెంసేపు కూర్చుని పోరాదా?' అని జగదంబ వేడుకుంది.

'కాదమ్మా కాదు, సంధ్యావందనం చేసుకోడానికి వేళ దాటిపో తూంది,— ఇంకా ఆలస్యం చేయలేను.' అని అంటూ తాండవశాస్త్రి వాకిట్లోకి వెళిపోయాడు. జగదంబ అతణ్ణి పంపడానికి [illegible]మ్మందాకా కూడాకూడా ముందు నడిచింది.

## ౫

కొన్ని హోమాపతిపుస్తకాలు చంక నిరికించుకుని తువ్వాలులో కట్టిన మందులపెట్టె చేత్తో పుచ్చుకుని కాంతారావు పొద్దున్నే వడివడిగా ప్రాక్టీసుకు పోతున్నాడు. విధవరాలయిన నాగిగాడి భార్య—'అయ్యా మీరు కరుణించకపోతే మే మెక్కడికి పోం బాబయ్యా' అని విన్నవించుకుంటూ అతని వెనువెనుకే పోతూంది.

మొహం వెనక్కి తిప్పి మాటాడేటంత తీరిక కాంతారావుకు లేక పోవడంవల్ల అతను కుడిచేయి వెనకాల ఆడిస్తూ, 'వొద్దొద్దొద్దు, మిమ్మల్ని పాకలో ఉండనియ్యడానికి వీల్లేదు, మీరు అలికీజాతివాళ్లు. మీరు మేకకు గంజి ఎందుకు పోశారు?' అని అన్నాడు.

ఉప్పరది ఆశ్చర్యంతో 'అందరి మేకలూ గంజి తాగుతయ్యా మారాజా!' అని అన్నది.

కాంతారావు భయం వేసేట్టు కోపగించి 'ఛీ అతలికి పో! అబద్ధాలు చెప్తావ్? ఎవళ్ల మేకలూ గంజి తాగవ్. మేకలు గడ్డి మేస్తయ్' అని అన్నాడు.

'గడ్డీ మేస్తయ్, ఆకూ అలమూ తింటయ్, గంజీ తాగుతయ్ బాబయ్యా' అని ఉప్పర దంది.

కాంతారా వట్లాగే చేయి తిప్పుతూ— 'ఒద్దొద్దు, మిమ్మల్ని ఇహ ఉండనియ్యను, మీ రిప్పుడే లేచి పొండి. బాపనవీథిల్లో మీరు మేకకు గంజి పెట్టారని తాండవశాస్త్రుల్లుగారు చెప్పి పోయారు. మీ మీద నా కిహ దయలేదు,— మీది వొట్టి పాడు జాతి' అని అన్నాడు.

'పోనీండి గంజి పోయడం మానేయమాండి?' అని ఉప్పరది కడ పారి ప్రార్థన చేసింది.

కాంతారావు సంకోచం లేకుండా— 'ఆఁ. మానేయండి! మీ కావులుంటే పోసుకోచ్చు, దోషం లేదు. ఇదేమిటి? మహా పాతకం! భయంకర విషయం! ఇప్పుడే మీరు లేచి పొండి, తెలిసిందా? అబ్బ!— ఎంత పొద్దెక్కిందో,— సల్ఫర్ ఇచ్చేవేళ దాటింది' అని అనుకుంటూ వడివడిగా రెం డడుగులు వేయంగానే ఉప్పరది వెనకనుంచి కరుణ స్వరంతో—'బాబయ్యగారండీ! నాపిల్లముండకు నిన్నట్నుంచీ రెండు మెతుకులయినా నోట్లోకి పోలేదు—

కాంతారావు వెంటనే వెనుదిరిగి నిలిచి_'ఎంచే తెంచేల? కడుపులో మలిసెప్పా? డో కొచ్చేట్టుందా?' అని అన్నాడు.

ఉప్పరది తలతో కా దన్నది.

'అయితే యేమిటి? పొట్టుబ్బిందా? ఆకలి లేదా?'

'కొండ మింగేంత ఆకలి బాబయ్యా.'

'ఏమిటీ? అలా చెప్పు! అదికూడా ఓ పెద్దరోగం,—స్కటం, అరోడం, ఇంకా ఈలాగే చాలా మందు అన్నయ్. ఇంతసేపటినుంచీ చెప్పావ్ కాదేం? ఒకఘట్కాతో పోగొట్టేవాణ్ణిగా! పదూ చూస్తాను.

ఉప్పరది కొంచెం వెనకముందాడి.—మం దొద్దు బాబయ్యా! కొంచెం బియ్యం పెట్టిస్తే పిల్లముండకు వండిపెడతా.—

కాంతారావు కాసేపు ఆశ్చర్యపడ్డవానిచందంగా చూస్తూ నిలబడి పోయి తరవాత ఇల్లా మండిపడ్డాడు—'మం దఖ్ఖర్లేదూ? బియ్యం కావాలా? పోపో! నాయెదట నుం చాతలికి లేచిపో దౌర్భాగ్య ముండ! అలక్ష్మీజాతి మొహంముండ!'

ఉప్పరది సిగ్గుపడి వెళ్లిపోవడానికి చూచేసరికి కాంతారావు గదమాయించి 'తిండికి లేకపోతే సత్యము పోయి అడుక్కోకపోయిందా?' అని అన్నాడు.

ఉప్పరది మొహమెత్తి చూచి ఊరుకుంది.

'అమ్మగారిదగ్గరకు పోతే చస్తావ్. నెరవొద్దున నుంచో. మీ అక్కయ్యగా రొస్తుంది. వొస్తే, నా పెద్ద మందులపెట్టెలో అర్ధరూపాయి బిళ్ల వుంది, నే నిమ్మన్నా నని అడుగు. కాని ఈమాట గుర్తుంచుకో— జబ్బు చేస్తే ముందు నన్నే పిలవాలి. అప్పుడు విస్సన్నను పిలిస్తే, ఖబర్దార్, జాగర్త—ఎవ రీ వచ్చేది? మల్లన్నా యేమిటి? ఇదిగో కొండన్న! 'ఇంట్లో అందరూ కులాసాగా వున్నారా?'

ఉప్పరది మెల్లమెల్లగా వెళిపోయింది. కొండన్న ముందు కొచ్చి 'దండాలండీ బాబయ్యా దండాలు! తమరి దీవనవల్ల అంతా కులాసా' అని అన్నాడు.

కాంతారావు అస్ఫుటంగా ఆశీర్వదించి 'మంచిది మంచిది. కాలమేమీ బా వుండ్లేదు. నాకు స్నానం చేయటానికిగాని తింటానికిగాని తీరిక లేకుండా ఉంది. ఇంటింటా పడిసాలూ, దగ్గులూ, బ్రాంకైటిస్ అందర్నీ ఏడిపిస్తున్నట్లుంది. పొద్దున్నే బయలుదేరా రెక్కడికి?' అని అన్నాడు.

'తమదగ్గిరికే' అని మల్లన్న అన్నాడు.

కాంతారావు ఉత్సాహంతో 'ఎందుకూ ఎందుకూ? నాదగ్గిరి కెందుకూ?' అని అడిగాడు.

మల్లన్న 'ఊళ్లో అందరికీ రాకపోకలకు బహుకష్టంగా ఉందండల్లుండుబాబూ! మురుగుకాలవమీద వంతెన వెయ్యాలి. మీరు వైకుంఠాని కమరకం ఇచ్చిన తోటకట్టవలో ఉన్న వెదురుబీడెం ఇయ్యకపోతే ఆపని అయేట్టు లేదు' అని అన్నాడు.

కాంతారావు కోపంతో—'నే నెందు కివ్వాలి? ఊళ్లో ఇహ ఎవరూ లేరా యేమిటి?' అని అన్నాడు.

ముసిలికొండన్న ఇంతవరకు ఊరుకున్నాడు. కాని ఇప్పుడు తల వంచి మళ్లా దణ్ణంపెట్టి 'మీకు అభయ మిస్తానంటే మనవి చేసుకుంటా అల్లుడుగారూ! ఈవూళ్లో మీరు తప్ప మరి మనుషు ల్లేరు. తమరు కొంచెం దయ తలిస్తే పదుగురూ బతికిపోతారు. మేం బీదసంసారులం. వాసం కొనే తాహత్తు మా కెక్కడుంది బాబయ్యా?' అని అన్నాడు.

కాంతారావు కాసేపు మౌనంగా ఉండి 'పదిమందికీ కష్టంగా ఉందేమిటి?' అని ప్రశ్న వేశాడు.

మల్లన్న 'చచ్చిపోతున్నారు బాబయ్యా, దూకలేక కాళ్లూ చేతులూ విరిగి చచ్చిపోతున్నారు బాబయ్యా!' అని అన్నాడు.

కాంతారావు—'కాని మీ దొరసానిగారు వింటే కొంప మునిగి పోతుందే!' అని అన్నాడు.

కొండన్న—'తమరు దయచేస్తే మళ్లా దొరసానిగారు మాటాడ తారా అండి? అంతగా వస్తే అంధరం కట్ట కట్టుకు పోయి వారి పాదాల ముంగల ప్రాణాచారం పడతాం' అని అన్నాడు.

కాంతారావు కాసేపు చింతిస్తూ నిలబడి 'నలుగురికీ కష్టం కలిగింది, సరే, వెళ్లి తెచ్చుకోండి—కాని, ఒక్కటి,—ఆవిడకుమాత్రం తెలియ కూడదుమీ! ఆ-హా! ఎంత హా ద్దొక్కింది?—రామన్న భార్యాకు రా త్రెల్లా వుందో ఎవరికేం తెలును? బ్రాయోలియా తాలూకు ఏక్షన్-కదిత్తే సెప్పి, మెదిత్తే సెప్పి,—అవును—కలుగుతుంది. మంచిది. వెళ్లాలి వెళ్లాలి' అని అంటూ వడివడిగా రెం డడుగులు వేసి కనిపించకుండా వెళిపోయాడు.

ముసిలి కొండన్న కొంచెం నవ్వాడు కాని మల్లన్న, 'కొండన్న తాతా! పిచ్చాయన పిచ్చాయు నని లోకు లంటారు నిజమే. కాని పేదవారి

కష్టసుఖాలు ఈ పిచ్చిధొరగారికంటె మరెవరికీ తెలియవ్. ఈయన మనస్సు, మకిల లేని గంగ' అని ఆ పిచ్చిదొర వెళ్లిన దారికేసి తిరిగి రెండుచేతులూ ఎత్తి ఒక నమస్కారం చేశాడు.

'సరే హుకుమయిపోయింది. ఇహ ఆలస్యం చేయొద్దు మల్లన్నా! వంతెన కట్టేసి మరోపని చూసుకుంటే సరి' అని కొండన్న అన్నాడు.

మల్లన్న తల తిప్పి 'మంచిది పద' అని అన్నాడు.

౬

సంధ్యాకాలంలోకి అంధకారం మెల్లమెల్లగా దట్టమవుతుంటూ వస్తూందికాని అప్పటికింకా దీపాలు పెట్టలేదు. వరఘులు చదువులగది మధ్యనున్న టేబిల్ మీద కాళ్లు పారేసి ఎదురుగా కనిపించే వస్తువులమీద చూపు పెట్టి స్థిరంగా కూచున్నాడు. అతని ఒళ్ళో తెరిచిన పుస్తకం ఉంది కాని అతడు చదవడం లేదు. కొంచెం జాగర్తగా పరిశీలిస్తే చీకటే అందుకు కారణం కాదని తెలుసుకోవచ్చు. ఎంచేతనంటే వెలుగు బాగా ఉన్నప్పుడుకూడా ఆ పుస్తకం అలాగే పడి ఉంది. అసలత డాపాటు నుండీ ఏపనీ చేయటం లేదు. ఇల్లు కదిలి వాకిట్లోకూడా రావడం లేదు. 'నేనొకమనిషికి సాక్షాత్తూ అస్పృశ్యుణ్ణయిపోయానే' అనే ఈ ఒక మాటే మాటిమాటికీ అతనిమనస్సులో గిరగిరా తిరుగుతూంది. తనను ముట్టుకొన్నంతమాత్రాన్నే ఒకమనిషి, తన నోట్లో వున్న తామలపాకు ఉమ్మేయ వలసినంత దూరం పోయినయ్ ఈనూ, తానూ. హఠాత్తుగా అతని చింతాధార ఆగింది. గుమ్మంలో చప్పుడయింది. అతడు కనుబొమలు కుంచించి చూపు నిలిపి 'ఎవరు వారు' అని అన్నాడు.

'నేను సంధ్యను' అని జవాబు చెప్పి తలుపు తెరుచుకొని లోపలికి వచ్చి సంధ్య గోడ కానుకుని నిలబడ్డది.

వరుణుడు గబగబా కాళ్లు తీసుకుని లేచి నిలదొక్కుకుని ఆశ్చ ర్యంగా ఇలా అన్నాడు—'నీ విక్కడి కొచ్చా వేమిటి? అందులో ఈ సమయంలో? లోపలికి రా! కూచో.'

'నాకు కూచోవడానికి తీరిక లేదు. చెర్లో నీళ్ళోసుకోడానికి బయలుదేరి దొంగచాటుగా ఇక్కడి కొచ్చా. మా మర్యాద కొంచెం నిలబెడతావా వరుణుడూ?'

వరుణుడు మరికాస్త ఆశ్చర్యంతో ఇలా అన్నాడు—'మర్యాదా? మీదా? తప్పక.'

'నా కాసంగతి తెలుసు' నంటూ కొంచెంసేపూరుకుని సంధ్య 'మా నాన్న చెప్పగా విన్నాను, కొన్నాళ్లనుంచీ నీ విల్లు కదలటం లేదట! ఏ పనీ చేయటం లేదట! ఎందుకో చెప్పుదూ!'

'నా వొంట్లో బాగు లేదు.'

'ఒంట్లో బాగులేకపోవడం అంత వింత కాదు కాని అసలదికాదు. అనారోగ్యమే కారణ మయితే మా నాన్న ఆమాటే ముందరస్తిగా చెప్పే వాడు'

వరుణుడు మాటాడలేదు. సంధ్యకూడా కాసేపల్లాగే ఊరుకుని కొంచెంసేపటి కిల్లా అంది—'కారణం నాకు తెలుసు. కాని నీ వెప్పుడూ మా యింటికి రాబోకు వరుణుడూ!'

వరుణుడు మెల్లమెల్లగా తల తిప్పి—'రాను,— మీయింటికిమాత్రమే కాదు. ఈ వూళ్ళో కాపరమే ఎత్తేస్తాను. దోషం లేందే ఒకళ్ల నొకళ్లు ఇంత తక్కువగానూ రోతగానూ ఎక్కడ చూడకుండా ఉంటారో అటువంటి చోటికి పోయి ఉండా లని రేయుంబవళ్లూ ఆలోచిస్తున్నా' అని అన్నాడు.

'జన్మభూమి విడిచేసి వెళిపోతావా' అని మోహ మైత్రి సంధ్య అన్నది.

'జన్మభూమే నన్నొదిలేసింది సంధ్యా! నేను దగ్గర కొచ్చినంత మాత్రాన్నే నీవు నీనోట్లో తమలపాకులు ఉమ్మి యాలిసినంత మైల నామీద ఉండేను; ఈ రోతను సహించికూడా ఇంకా ఈ ఊళ్లోనే ఉండమని నీ వనగలవా!'

సంధ్య నిరుత్తరంగా తల వంచుకుని నిలుచుంది. వర్షు లిల్లా అన్నాడు—'ఆచార మనే పేరితో చాలాకాలంనుంచీ వస్తూన్న ఈ సంస్కారం ఇహాముందు బహుశా మీ మనస్సును స్పృశింపనైనా స్పృశింపదనుకుంటాను కాని ఎక్కడైతే స్పృశిస్తుందో అక్కడ మనుష్యుల చేతిమీదుగా మనుష్యులకు కలిగే ఈ అవమానం, మనుష్యుణ్ణి దేవనాళూలంచే ఎంత దూరం గుచ్చుకుందో ఆసంగతి ఒకనా డీరీతిగా నేను చవిచూడవలసి ఉంటుం దని కలలోగూడా అనుకోలేదు సంధ్యా!'

సంధ్య కాస్సేపు మౌనం తాల్చి ఇల్లా అంది—'దారే పోయే దయ్యాన్ని నీవు పిలవలేదా వర్షులూ!'

'పిలిచాను కాబోను! కాని సంధ్యా! ప్రాయశ్చిత్తమేమైనా చేసుకుంటే ఏమైనా ఉపాయంగా ఉంటుందేమో చెప్పగలవూ?'

'ఉండచ్చు. కాని ఆత్మగౌరవం పోతుందని నీ విదివర కందుకొప్పుకున్నావుకావు. అట్టి నీవే ఇప్పుడు మళ్ళా ఆత్మగౌరవం విడుచుకుంటే ఈ ఊళ్లోమాత్రం ఉండద్దు.'

'నే నింకో ఊళ్ళో ఉన్నా నీవు నన్నక్కడమాత్రం ఏవగించుకోకుండా ఉంటావా?'

'ఒకవేళ ఏవగించనే ఏవగించుకుంటా ననుకో! దానివల్ల నీకు పోయే దేమిటి వచ్చేదేమిటి?'

'ఈమాట నీవుకూడా అక్షరాలా అనగలిగావా సంధ్యా ?'

'నీవు నా లజ్జా సంకోచాల ఆవరణాన్నయినా ఉండనిచ్చావు కావు వరుఖులూ! ఆభాసచేతా ఇంగింతంచేతా ఎన్నోసారులు తెలిపా గాని ఏం ప్రయోజనం? నీ యాచనాధికారం ఎంతకూ ఆగలా. మానాన్న ఒప్పుకోచ్చు. మాఅమ్మకూడా మరవొచ్చుకాని నేనయితే మరవలేను. నే నెంతో గొప్ప బ్రాహ్మణకన్యను!

వరుఖులు ఆశ్చర్యంచే మతిమాలినవాడి చందంగా-'మరి నేనో?' అని అన్నాడు.

'నీవూ నాజాతివాడవే,—కాని పులీ పిల్లీ ఒకటి కాదునుమా' అని సంధ్య అన్నదికాని అనేసినవెంటనే లోలోపల గడగడ లాడిపోయింది.

వరుఖులు, విస్మయంతోటీ వ్యథతోటీ నిండిన తన రెండు కళ్ళూ సంధ్య ఎదుటనుండి తప్పించుకున్నాడు. అంతేకాని మరి మాటా పలుకూ లేక ఊరుకున్నాడు.

సంధ్య బలత్కారంగా కొంచెం నవ్వు తెప్పించుకోడానికి ప్రయ త్నించి ఇలా అంది, 'నీ వెక్కడికి వెళ్లినా సహజంగా నన్ను మరవలేవను కుంటా వరుఖులూ' చీటికీ మాటికీ ఇన్ని అవమానాలు నీకు మరెవరూ చేయ లేదు. చాలాకాలం నీ మనస్సులో ఉంటా.

వరుఖులు మొహమెత్తి 'నీ వెందు కొచ్చావో ఆసంగతి ఇంతవరకూ చెప్పావుకావు' అని అడిగాడు.

సంధ్య ప్రత్యుత్తరంగా కొంచెం నవ్వింది. ఒకనిమిషం ఆగి ఇలా అంది—'ఈజగత్తులో ఆశ్చర్యాల కంతూ పొంతూ లేదు.' ఈమాట అని ఏదో చెప్పబోయి హఠాత్తుగా ఆగి—'అయినప్పటికీ నా గౌరవం నీవు కాపాడకపోతే ఈజగత్తులో కాపాడేవారు మరొకరు లేరు. ఇది నీవు విశ్వ సిస్తావా వరుఖులూ!' అని అంది.

వరుహులు నిశ్శబ్దంగా చూస్తూ ఊరుకున్నాడు.

సంధ్య ఇలా అంది, 'నాగిగాడి తండ్రి కోడలినీ మనమరాలినీ ఇంట్లోంచి వెళ్లగొట్టాడు. అది చూసి మానాన్న వాళ్లను వెంటబెట్టు కొచ్చాడు. నేను వాళ్లకు చోటిచ్చాను.'

'ఎక్కడ ?'

'మా పాత గొడ్లపాకలో. కాని బాపనగుడికట్టులో వాళ్లుం టానికి వీల్లేదు.'

వరుహులు విస్మయంతో 'ఎంచేతా ?' అని అడిగాడు.

సంధ్య ఇల్లా అంది : ఎంచేతేమిటి ? వాళ్లుప్పర్లు కాదూ ? వాళ్లు మన నూతులో నీళ్లు తోడుకుంటారు, మేకకు దారిలో గంజిపోస్తారు,— తాండవశాస్త్రుల్లుగారు తెలియక యెక్కడ తొక్కిపోతాడో అని పొద్దుస్నే వాళ్లను చీపురుకట్టతో నాలుగుతికి తన్ని తగిలి మరీ స్నానం చేస్తానని అమ్మ ప్రతిజ్ఞ చేసుకున్నుర్చుంది. నీవు వాళ్ల కొంచెం చోటియ్య వరుహులూ !, —వాళ్ల కేమీ లేదు, నిలువ నీడ లేదు.'

'భేష్ !, కాని ఎక్కడ చోటుంది !'

'ఆ సంగతి నాకేం తెలుసుగాని ఎక్కడయినా ఉందేమో చూడు! నీకుగాక మరి నే నెవరికి చెప్తాను ?'

వరుహులు కొంచెం ఆలోచించి 'మా తోటమాలీ వాళ్ల నెళ్లాం. —వాడి పాకలో ఉంటారేమో కనుక్కో ! వాళ్ళుగనుక ఉండేట్టయితే కొంచెం సర్దుబాటు చేద్దాం.'

సంధ్య మొహం మెత్తి మాటాడలేక వంచిన తలమాత్రం తిప్పి అంగీ కారం తెలిపింది.

'అలాగయితే వాళ్ళను పంపు. తోటమాలీ తిరిగివస్తే వాడికి వేరే ఏర్పాటు చేస్తా'

సంధ్య ఈమాటకూ్కడా జవాబు చెప్పలేకపోయింది. ఆరీతిగానే వశనేత్రాలతో నిల్చొని తనను తానే సంబాళించుకుంటూ ఉండి ఉండాలి. ఇల్లా ఉండి కొంతసేపటికి, ఇప్పుడు నా నోట్లో తామలపాకు లేదు, పైగా స్నానం చేసిపోడాని కొచ్చా. ఇప్పుడు నీకు పాదవందనం చేసిపోతా' అని అతని కాళ్ళంటి నమస్కారం చేసి గబగబా వెళిపోయింది.

ఆమెను వెనక్కి రమ్మనడానికిగాని మరేమయినా అడగడానికిగాని ఏమాత్రమూ ప్రయత్నింపక వర్షుడు ఆమె వెళ్లిన దిక్కే చూస్తూ స్తంభ మల్లే కదలకుండా మెదలకుండా నిలుచున్నాడు.

౭

రెన్నాళ్ళ తరువాత నయివుంటుంది, జగదంబ చెర్లో స్నానం చేసి ఇంటికి వొస్తూంది, దార్లో పేరమ్మ ఎదురుపడ్డది. పేరమ్మ కళ్లూ మొహ మూ ఉత్తేజనచేతా పట్టుదలచేతా ఉబ్బి తబ్బిబ్బయి పోతూ ఉన్నయ్. ఇల్లా దగ్గిరి కొచ్చి కన్నీళ్ళచే గదగదమంటూ 'జగదాంబా! మా అమ్మ జగదాంబా! నీ కూతురు పిచ్చితల్లి చివర కెంత తపస్సు చేసుకుందే! ఆహా! ఇది స్వప్నానికూ్కడా అతీతంగా వుందే!' అని అన్నది.

జగదంబ కేమీ తెలియలేదు. కాని పేరమ్మనోట్లోంచి కూతురు మాట రాంగానే భయపడింది. 'ఏం జరిగిం దత్తా? సంధ్య ఏం చేసింది?' అని అడిగింది.

'ఏం చేసిందా? అదేం చేసిందో ఈ ప్రపంచంలో మరే పిల్లయినా చేసిందీ? సరేకాని తడిబట్టలతో తడితలతో వెళ్లి దేముడిముందు సాష్టాంగ పడి రా! పరమేశ్వరుడికీ పార్వతీదేవికీ భోగం చేయించు! దుర్గకు పసుపు కుంకుమలు నలిపించు! ఇదుగో సరేకాని ముందుగానే చెప్పిపెటుతున్నా,

నాకుమాత్రం మెళ్లో ఇష్టకవచం తగిలించుకోడానికి మోటయిన బంగారపు హారం చేయించిపెట్టు!

జగదంబ కలవరపడి 'ఏమిటత్తా ఏమిటి? విప్పి చెప్పకుంటే నాకేం తెలుస్తుంది?' అని అంది.

పేరమ్మ కొంచెం నవ్వి 'విప్పి చెప్పాలా? అవుయితే చెప్తాను. మీతల్లిబిడ్డ లెంతో పుణ్యాం చేసుకున్నారే, లేకపోతే ఈలా ఎన్నటికీ జత పడదే! పిల్లదాని పెళ్ళి ఎల్లా చేస్తావా అని ఆలోచించి ఆలోచించి అట్టు డికిపోతున్నా. ఇహ ఫరవాలేదు పో! ఓక్కసారిగా రాజుగారి కత్తగారవ్వై కూచోపో' అని అంది.

ఈమాటలు విని జగదంబ గుడ్లు కపాలంలో పెట్టుకుని చూస్తూ నిలబడ్డది.

పేరమ్మ దయ ఒలకబోసే పలుకుబడితో ఈలా అన్నది—'ఇది తెలియని దోషం నీ ఒక్కత్తెకే కాదు; నాక్కూడా మొదట అల్లానే ఉంది. నేనుకూడా మొదట నీకుమల్లేనే గుడ్లు పెట్టుకొని చూశాను. ఇంతే కాదు, నిద్రపోతూ నిద్రపోతూ కల గన్నానాయేం చెప్పమా అని అను కున్నా.'

'విప్పిచెప్పత్తా, విప్పిచెప్పు. ఆకాశ పాతాళాలు గాలించినా నాకేమీ తెలీక ఛస్తున్నా.'

అప్పుడు పేరమ్మ జగదంబ కుడిచెయ్యి పిడికిటితో పట్టుకుని దగ్గరగా లాక్కుని చెవిదగ్గిరికి మూతి పోనిచ్చి 'ఇదిగో రహస్యంగా ఉంచుకుమీ! సంతోషంతో నలుగురకూ చెప్పకు సేవ్ గనుక? పడగొట్టేవాళ్ళు కావలసినంతమం దుంటారు. శాస్తుల్లు నన్నుతప్ప ఈపృథివిలో మరొర్ని నమ్మడుగనుక చీకటితో నన్ను పిలిచి 'పేరూ! జగదాంబ కీ మాట చెప్పిరా, పో! పిల్లదాని పెళ్ళి కిహ బెంగ పెట్టుకో నక్కర్లేదు—నాచేతి

లోనే పెట్టి రాజుగారి అత్తగారిలాగా నిర్భయంగా కాలు మీద కాలేసు క్కూచో మను' అని చెప్పాడు. ఈమాటలు విని నే నిల్లా అనుకున్నా— మా వైకుంఠపురంకూడా శూన్యమై బావురుమంటూంది,—పిల్లాణ్ని పెంచ డాని కాడదిక్కు లేదు,—సరే మంచిది, ఒక పనితో రెండు పనులు కలి సొచ్చేయ్. ఒక టేమంటే, బ్రాహ్మడి కులం రక్షించటం, రెండో దేమి టంటే, ఊరిపిల్ల ఊళ్లోనే ఉండిపోవడం. మీకూడా ఒక్కర్తే కూతురు గదా,——

పేరమ్మ ఈ రాజుగారి అత్తగారిమొహం చూసి చెపుతూ చెపుతూ వున్న మాటను పూర్తి చేయలేకపోయింది.

పేరమ్మ డీల్లపోయి 'ఏమిటే జగదాంబా! అల్లా అయిపోయావ్ ?' అని అంది.

జగదంబ యథాస్థితికి వచ్చి నిట్టూర్చి—'కాదత్తా! శాస్తుల్లుమామ నిన్నల్లా తమాషా చేశాడు' అని అన్నది.

'తమాషా యేమిటే? నా కిన్నే ళ్ళొచ్చేయ్. తమాషాఅంటే ఏమిటో నాకు తెలీదూ? అదీగాక అతడు నన్ను తమాషా చేస్తాడా? అక్కా తమ్ముళ్ల నడుమ తమాషా లేమిటి?'

'తమాషాకాక మరి యేమిటత్తా? ఇ దెన్నడయినా జరిగే మాటేనా?'

పేరమ్మ కొంచెం నవ్వి—'నిజమేనే జగదాంబా! నాకూ మొట్ట మొదట తమాషాగానే వుంది. కల గన్నానా అని అనుకున్నా. లేదులేదు, మేలుకొనే ఉన్నానని వెంటనే కనుక్కున్నా. ఇది నిజంగా పిల్లదాని అదృష్టం. కాకపోతే ఇటువంటి దెక్కడయినా యెవరయినా యెప్పుడ యినా విన్నారా కన్నారా? 'కన్నెచెర వదలిపోవాలి! పసుపు కుంకుమలు చల్లగా ఉండాలి' అని నేను దీవిస్తా. పద యింక పద! నేను చెప్పిన అంగ

రంగ భోగాలు చేయించు! అయినో చెవిని పడనీయకు మీ! వేంతకో తాంబూలాలు పుచ్చేసుకోండి' అని అన్నది.

జగదంబకు నోట మాట రాలేదు. బొమ్మలాగా నిశ్చేష్టురాలై నిలబడ్డది.

పేరమ్మ మళ్లా ఇల్లా అంది—'ఈ మార్గశిరమాసం దాటాక ఒక యేడాది మంచిది కాదు. మన తాండవం అభిప్రాయం—అని కొంచెం ముసిముసి నవ్వు నవ్వి మళ్ళా ఇల్లా అందుకుంది—, ఎందుకు మారుతుంది లే. పిల్ల బంగారు బొమ్మ. లక్ష్మి! ముని అయినా మోహపడతాడు. ఇహ మన తాండవశాస్త్రుల్లు లెక్కేమిటి?' అని జగదంబ చేతిమీద వేలితో కొట్టి ఊం. ఇహ వెళ్లమ్మా! తడిబట్టలతో ఇహ నిల్చోకు!,—నేనూ పోతా, పొద్దోయింది, పొద్దటు వాలింతర్వాత మళ్లా వస్తా. చెప్పాలిసిన మాటలు చాలా ఉన్నయ్' అని పేరమ్మ మరి వృథా కాలయాపనం చెయ్యక ఇంటి కేసి నడవడం మొదలుపెట్టింది.

జగదంబ తూలిపడుతూ తూలిపడుతూ ఎల్లాగో ఇంటికి చేరుకుంది. పూజాగృహానికి పక్కగా వున్న అరుగుమీద బిందె తప్పున కూలేసి తడిబట్ట లతో తానుకూడా అక్కడే కూలబడ్డది. ఆమెకన్నులు వేడి కన్నీళ్ళతో నిండిపోయెయ్.

ఆమెకు సంతానం ఈకూతు రొక్కత్తే. ఈ కూతురు, రూపం లోనూ గుణంలోనూ నిజంగా లక్ష్మి. తాండవశాస్త్రి అనే నరకకుండం లో ఈ లక్ష్మిప్రతిమను విడిచిపెట్టేయమని పిలుపొచ్చింది: వయస్సునుబట్టి చూస్తే ఈ తాండవశాస్త్రి సంధ్య తాతయ్యకంటెగూడా పెద్ద. సంధ్యను అట్టి ఈ తాండవశాస్త్రి కివ్వడంకంటె యముడి కివ్వడం మంచిదనే అభి ప్రాయం అగ్నిశిఖలాగా జగదంబ కడుపులో మసలుతున్నా 'ఇవ్వను' అనే మాట ఆమె నోటితో అనలేకపోయింది. ఆమె స్వతహాగా సద్బ్రాహ్మ

జాకులంలోది—స్వసంఘంలోనూ తోటికుటుంబాలలోనూ ఈలాటి దొక విచిత్రవిషయం కాదు—ఇంతకంటె వైపరీత్యాలు కళ్లారా చూచింది—అంతేత తనకూతురుమాట తలచుకొని లోలోపల తగులడుతున్నా ఇట్టి దసంభవం అని ఆ మటను ఆక్షేపయడాని కెక్కడ వెతికినా ఆమె కొక నీటి బొట్టయినా దొరకలేదు. ఒంటరిగా కూచుని నిశ్శబ్దంగా కళ్లొత్తుకొంటూన్న ఆమె మనస్సులో 'ఇహ కొద్దిరోజుల్లో ఈ సంబంధమే నిజమై కూచుంటుంది.—ఈ రోతమనిషికి దీన్ని పెళ్లాడదామనే దురభిప్రాయం బాగా కలిగింది. ఇతని వాసన చాలా దుర్జయం. దీన్ని అరికట్టడానికి ఉపాయమేమీ దొరకదు కాబోలు' అని తోచింది. ఆనాడు తాండవశాస్త్రి తనతో రహస్యంగా మాటాడిపోయిన మాటలే ఆమె హృదయంలో గిర్రున తిరుగుతున్నయ్. ఆ మాటలలో ఇంత విషం ప్రచ్ఛన్నమై ఉన్నట్లు ఆనా డెవరు సందేహించగలరు?

సంధ్య ఒక ఉత్తరం చదువుతూ చదువుతూ ఒకొక్క అడుగే వేసుకుంటూ ఎదటి గుమ్మంలోంచి వస్తూంది. చదవడం బహుశా అయివుండదు, అటూ ఇటూ చూడకుండానే 'అమ్మా! అమ్మా! ఎక్కడ'? అని పిలిచింది.

జగదంబ గబగబా కళ్లు తుడుచుకుని 'ఎందుకమ్మా?' అని అన్నది.

తల్లిమాట భారంగా వినిపించడంవల్ల సంధ్య మొహామెత్తి చూసి మెల్లమెల్లగా దగ్గిర కొచ్చి 'ఏ మయిందేమిటమ్మా?'

జగదంబ తనకూతురు వాడిచూపులనుంచి మొహం తప్పించుకుని 'ఎబ్బె, ఏమీ లేదమ్మా' అని అంది.

సంధ్య మరికాస్త దగ్గిర కొచ్చి తన పైటకొంగుతో తల్లికళ్లు జాగ్రత్తగా తుడిచి జాలిగొంతుకతో 'మా నాన్న ఇవ్వా ళేమయినా చేశాడా అమ్మా' అని అడిగింది.

'ఎబ్బే, ఏమీ చేయలేదు.'

కూతురీమాట నమ్మలేదు. మెల్లమెల్లగా ఆమె తల్లిదగ్గరగా కూచుని 'సంసారంలో విషయాలన్నీ మన అధీనాలు కావు. అందరూ మా నాన్నను 'పిచ్చి దేముడు, పిచ్చి దేముడు' అని పిలుస్తారు. నీవుకూడా అలాగే అనుకోరాదమ్మా' అని అంది.

'లోకులట్లా అనుకుంటే అనుకోచ్చు. దానివల్ల లోకులకేమీ వచ్చింది లేదు, పోయింది లేదు. కాని నాలాగా ఈ బాడబాగ్నిని ఎవరూ హరించుకోలేరు.' అని జగదంబ అంది.

'ఈ బాడబాగ్ని యెట్టిది?, దీని తాపం ఎవ రోరుస్తున్నారు?,' అనే విషయం ఎన్నాళ్లింత ఆలోచించినా దీనికి తగిన సమాధానం సంధ్యకు దొరకలేదు. నిరీహుడూ నిర్విరోధీ పరదుఃఖకాతరుడూ తెలివితక్కువవాడున్నూ అయిన తన తండ్రినిగురించి విచారిస్తూన్న సంధ్యమనస్సు భక్తిచేతా సమవేదనచేతా కరిగిపోయి కన్నుల్లో నీళ్లు నిండగా ఆమె—'అమ్మా! నాకు సాధ్యమయితే మానాన్నను తీసుకుని ఏ కొండల్లోకో ఏ అరణ్యాల్లోకో పోయి వుండేదాన్ని: ఆయనదుఃఖం అప్పు డెవరికీ సహించవలసిన పని పట్టేది కాదు.' అని అంది.

జగదంబ గబుక్కున కూతురు బుగ్గలు నొక్కి ఒక్క ముద్దెటుకుని 'పోనీ అమంగళప్మాటలు, అయితే, నేను నీకు సవతల్లినా యేమే? మీ నాయనగారిలో సంగోరుపాలయినా నన్నెన్నడయినా క్షేమించావుటే సంధ్యా?' అని అంది.

'నీ మీద నాకు ప్రేమ లేదా అమ్మా' అని సంధ్య అన్నది.

'ఏమో, నీప్రాణమంతా వారిమీదే. దారిలో నడుస్తుంటే ఆయన కెక్కడ కంకర గుచ్చుకుపోతుందో అన్నట్లుగా వుంటుంది నీ భావం.

ఆయన ముందేమీ పని చెయ్యాదని నీకు తెలుసు. ఆయనకు ఎక్కడ కష్టం తగులుతుందో ఎక్కడ అవమానం అయిపోతుందో అని ఇంకోళ్ళ మందు తినక ప్రాణాలమీదికి తెచ్చిపెట్టుకుంటున్నావ్. ఈసంగతు లన్నీ నాకు తెలియవా సంధ్యా?'

రెండుచేతులూ తల్లి మెడకు వేసేసి సంధ్య—'ఏమిటీ? మానాన్న వంటి డాక్టరెక్కడయినా ఉన్నాట్టమ్మా? అని అంది.

'లేదు, ఆమాట నిజం.'

సంధ్య కినిసి 'యేమిటమ్మా ఫా! ఊరికే శేళాకోళం చేస్తే సరా? జబ్బు ఒక్కనాట్లో కుదురుతుందా? నాకు వెనుకటికన్న చాలా తేలికగా వుంది.' అని అప్రసంగం అక్కడి కాపి 'ఉప్పర్లు లేచి పోయారమ్మా, బతికిపోయారు పాపం' అని అంది.

'ఎప్పుడు లేచిపోయారు?'

'ఏమో ఎవరికి తెలుసు? పొద్దున్నే లేచిపో యుండచ్చు.'

సంధ్య తనకు తెలియనట్లు ఇల్లా నటించడం ఆ తల్లిని మరిపించలేక పోయింది. 'వాళ్లెక్కడికి వెళ్లారో తెలుసా?' అని అడిగింది.

'వర్షులవారి యింటివెనుక తోటలోకి వెళ్లి ఉండచ్చు: అక్కడ తోటమాలీ గుడిసె లేదూ? బహుశా అందులోకి' అని సంధ్య తన కేమీ తెలియన ట్లంది.

'వర్షులుదగ్గిరకు వాళ్ల నెవరు పంపారు? బహుశా నీవేనా?'

సంధ్య లోలోపల చిక్కుపడి తుద కెల్లాగో ఒకల్లా అబద్ధాన్ని ఇల్లా బతికించుకుంది—'వర్షులుదగ్గిరికి నే నెందుకు వాళ్లను పంపుతా నమ్మా? నే నెవళ్లనూ ఎవళ్లదగ్గరకూ పంపలేదు.' సంధ్య ఇల్లా అని మిక్కిలీ అసందర్భమయిన ఈప్రసంగాన్ని వడివడిగా దాటేసి తన చేతిలో

ఉన్న ఉత్తరం విదిలించి పట్టుకుని, 'ఇంతకూ అసలుమాట చెప్పటం పడ లేదమ్మా! మానాయనమ్మ కాశీనించి ఉత్తరం రాసింది, తప్పక వస్తా నని, ఆమె ఎప్పుడూ అబద్ధ మాడదు,—ఈసారి ఆమెకు దయ పుట్టిన ట్లుంది' అని అంది.

'అత్తగారు రాశారా? ఎప్పుడు వస్తామని రాశారు? అని జగదంబ ఔత్సుక్యంతో అడిగింది.

కాశీలో నివాసం ఏర్పరుచుకుని సన్యసించి వున్న ఆమెఅత్తగా రొక్కనాడయినా కాశీ విడిచి ఆవల కాలుపెట్టడాని కిష్టపడదు. అట్టి అత్తగారికి జగదంబ—'నా కిది ఒక్కత్తే కూతురు, ఈ మనుమరాలిపెళ్లికి తప్పక రావాలి, తప్పక రావడమే కాకుండా కన్యాదానం మీచేతిమీదుగా జరిగించాలి' అని ఉత్తరం రాయించింది. ఆ అత్తగారు కన్యాదానం చేయ డాని కెంతమాత్రమూ ఒప్పుకోలేదుగాని పెండ్లికిముందుగా వస్తా నని ఉత్తరం రాయించింది.

తనపెండ్లిమాటకు సిగ్గుపడి సంధ్య 'నీ ఉత్తరానికి జవాబు నీవే చదువుకో! అని సంధ్య ఆ ఉత్తరం తల్లిముందు పడేసి హఠాత్తుగా వ్యగ్ర త పొంది 'ఏ మమ్మా! ఇంతవరకూ తడిబట్టలతో నే ఉంటివి,—వెళ్లొస్తా నుండు, నీ పొడిబట్ట గబుక్కున తెచ్చిస్తా నుండు' అని గబగబా వెళిపో యింది.

అత్తగారిఉత్తరం తలమీద పెట్టుకుని 'ఈ కోడలిమీద ఇన్నాళ్లకు నీకు దయ వచ్చిం దామ్మా' అంటూ జగదంబ లేచి మెల్లమెల్లగా దేవ గృహంలోకి వెళ్లబోయే ప్రయత్నంలో ఉంటూండగా ఆమెమగడు గోల గోల చేసుకుంటూ అకస్మాత్తుగా ఇంట్లోకి వచ్చిపడ్డాడు—'నేను రెన్నాళ్లు పోలేదు, రెన్నాళ్లు చూడలేదు, అపళంగా హైపోకాండ్రియా డెవలప్ చేసుకున్నాచున్నాడు' అని అత డంటున్నాడు.

జగదంబ మగడితో ఆట్టే మాటాడదుగాని, ఈనాటి అతగాడి గందరగోళమూ, విశేషించి పన్నెండుగంటలు కాకమునుపే అకస్మాత్తుగా ఇంటికి రావడమూ చూచి చాలా ఆశ్చర్యం పొంది అలవుగొంతుతో— 'ఎవరి కేమిటి జబ్బు?' అని అడిగింది.

'వఝులుకు. నేను హైపోకాండ్రియా అని డయాగ్నైజ్ చేశా. కాదంటాని కెవడి బాబుతరం? దీని సంగ తేమిటో విస్సన్నను చెప్ప మను చూదాం' అని కాంతారా వన్నాడు.

ఇంకోసమయమయితే జగదంబ మరి మాటాడక పోయేదేకాని వఝులుమాట వినబడడంచే కలతపడి 'వఝులు కేం?' అని అన్నది.

'ఏమిటో చెప్పావగా. విస్సన్నకే తెలియకపోతే ఇహ నీకా తెలిసేది? అయినప్పటికీ ఏదోలే, కొంచెం ప్రాక్టీస్ గీక్టీస్ చేస్తున్నాడుగా, అతగాడికే తెలియకపోతే! సరే! వఝులు మాటా ముల్లే సర్దుకున్నాడు. ఇల్లూ వాకిలీ తోటా దొడ్డీ పొలమూ పుట్రా పసుస్తమూ అమ్మేస్తున్నాడు. కేశవరావు కొనబోతున్నాడు,—ఇంతలో భాగ్యవశాన్న నే పోయి పడ్డా! నే నేపూట ఎక్కడికయితే పోనో ఎవర్నయితే చూడనో ఆపళంగా అక్కడేదో ఒక విడ్డూరం జరుగుతుంది. ఇల్లా అయితే నే నిహ బతకలేను బాబూ! సంధ్యా! ఎక్కడి కెళ్లావే యిప్పుడూ? వెంఠనే మెటీరియా— మెడికా పట్టుకొస్తూ, ఒక రెమిడీ సెలెక్ట్ చేసి ఇచ్చేసొస్తా'.

'వస్తిన్నానాన్నా' అని లావుపాటి పుస్తక మొకటి చేత్తో పుచ్చుకుని వచ్చి సంధ్య తండ్రిదగ్గిర నిలబడ్డది.

'వఝులు సంగతి తిన్నగా చెప్పండి, తెలిసేట్టు చెప్పండి, మీ కాళ్ల మీద పడతాను' అని జగదంబ కోపంగా అన్నది.

కాంతారా వులికిపడి,—అదా, హాయిపో—మానసికవ్యాధి!

తన ఆస్తంతా కేశవరావుకు అమ్మేసి కొద్ది రోజుల్లో అతడు దేశం విడిచేసి లేచిపోతాట్ట! అట్లా జరగడానికి వీల్లేదు, వీల్లేదు, అట్లా జరగనియ్యను. 200 పొటెన్సీ మందొకటి——

సంధ్య వెలవెలపోతూ మొహం వంచుకుని మాటాడక నిలబడి ఊరుకుంది. జగదంబ వ్యాకులకరంతో 'వఝులు ఇల్లూ వాకిలీ అమ్మేసి లేచి పోతాడూ? అతని కేమయినా పిచ్చెత్తిందాయేం? అని అన్నది.

కాంతారావు చెయ్యెదురుగా ఎత్తి—'ఉ హుఁ అది కాదు, ఉ హుఁ. అది కాదు. నికారస్ హాయిపోకాండ్రియాస్. పిచ్చి కాదు,— దాన్ని ఇన్సానిటీ అని అంటారు. దాని మందు వేరు. విస్సన్నయితే పిచ్చి అనే పేరెట్టు క్కూచునేవాడే కాని——

జగదంబ ఒక్క చూపుతో కూతురు మొహం గ్రహించి మగని రను ఒక్క ఉరుముతో ఆపుజేసేసి తేటతెల్లంగా ఇల్లా అంది—'మీ సంగతి వింటానికి నాకు తీరిక లేదు. వఝులు దేశం విడిచిపోవడానికి సంకల్పించుకున్నాడా చెప్పండి'

'సంకల్పించుకోడ మేమిటీ; అంతా సిద్ధమయిపోతే, చెప్పుల్లో కాళ్ళెట్టుకుంటే. కేవలం నేను పోయి—

'అదుగో మళ్ళా నేను? నేనెవతె క్కావాలి? వఝు లెప్పుడు వెళ్తాడు?

కాంతారా వటూ ఇటూ చూచి 'ఎప్పుడా? ఇప్పుడు వెళ్తే ఇప్పుడే వెళ్ళచ్చు,—లేకపోతే రే పెళ్ళచ్చు. వాడు, ఆ కేశవరావుగాడు—

'కేశవరావు ఆస్తంతా కొంటా నన్నాడా?'

'కొ నాను. వాడి కదే కోరిక. మూడు దుగ్గాన్లకు కొట్టెయ్యాలని చూస్తున్నాడు'

'ఈమాట గ్రామంలో మరెవరికయినా తెలుసా ?'

'ఊరికీ దోమకూ కూడా తెలీదు. అదృష్టవశాత్తూ కేవలం నాకు——

'మీ అదృష్టం వినా లని నాకు కోరిక లేదుగాని మీ కోసారి అత గాణ్ణి పిలిచిపెట్టండి. మీ అత్త ఒక్కసారి తొందరగా రా మన్నదని చెప్పండి !'

సంధ్య ఇంతవరకూ ఒకమాటయినా అనక మెదలకుండా నిలుచుని వింటూంది కాని ఇప్పుడు కన్నెత్తి చూచింది. ఆమెమొహం పాలి పోయింది. మాటాడబోతే పెదవులు వొణికాయ్. కాని ఆమె గట్టిగా ఇట్లా అంది——'ఎందు కమ్మా నీ వతన్ని పిలిచి చీటికీ మాటికీ అవమానం చేయబూనుకుంటావ్ ? నీ కేనాడేనా అత డింత అపరాధం చేశాడా యేమిటి చెప్పు చూదాం !'

జగదంబ భయంకరమయిన ఆశ్చర్యంతో ఈలా అంది. 'ఎవ రతని కవమానం చేయబూనుకున్నారు సంధ్యా !'

సంధ్య ఇలా అంది——'వొద్దొద్దు, నీ వెన్నడూ అతణ్ణి ఈయింటికి పిలిపించకు.'

'పిలిపించి రెండు మంచిమాటలు చెబితే దోషమా ?'

'మంచికానీ, చెడ్డకానీ, అత డీవూళ్లోనే ఉండనీ, దేశాంతరమే లేచిపోనీ, ఇల్లూ వాకిళ్లూ అమ్ముకోనీ లేకపోతే మానుకోనీ, రెండు మంచి మాటలు చెప్పడానికి మన కేమిటి సంబంధం ? అతన్ని నీ వీ యింటికి పిలిపిస్తే చెర్లో పడి చావకపోతే నీమీదొట్టు' అని అంటూ అంటూనే తల్లి ప్రత్యుత్తరం వినదలచుకోనయినా వినదలచుకోక సంధ్య వడివడిగా వెళిపోయింది.

సైసలేని నిస్సహాయతతో జగదంబ రెండుకళ్లూ పెట్టుకుని చూస్తూ నిలబడిపోయింది. కాంతారావుమాత్రం బిగ్గరగా 'పుస్తకం ఇక్కడ పారెయ్యకుండా వెళిపోయావేమిటే? అలస్యమయిపోతూంది. ఒక రెమిడీ సెలెక్ట్ చేసేస్తునుగదే సంధ్యా' అని అనడం మొదలుపెట్టాడు.

సంధ్య మళ్లా వచ్చి చేతిలో గ్రంథం తండ్రిముంగల పెట్టి వెళిపోయింది. కాంతారావు అక్కడే కూచుని ఔషధనిర్వచనంలో మనోనివేశం చేశాడు.

జగదంబ కొంచెంసేపు మాటాడక నిలుచుని మగనిని చూచి 'మీరిహ అమ్మాయికి పెళ్లి చేయకపోవడం నిశ్చయం చేసుకున్నారా యేమిటి?' అని అడిగింది.

కాంతారావు పుస్తకం తిరగేస్తూ తిరగేస్తూ 'పెళ్లి చేయనూ? నిశ్చయంగా చేస్తా' అని అన్నాడు.

'ఎప్పుడు చేస్తారు? చివర కేదో కొంచెం జరిగాకా?'

'ఊఁ.'

జగదంబ ఒకముహూర్తం ఊరుకుని 'ఒకసారి వైకుంఠపురం పోయి చూచి రారాదా?' అని అంది.

పుస్తకంలో చూస్తున్నచోటు వేలితో నొక్కిపట్టుకుని కాంతారావు మొహమెత్తిచూచి, 'వైకుంఠపురమా? ఎవరి కేమిటి జబ్బు? ఎవరయినా కబురంపారా? ఎప్పుడు పంపారేమిటి?' అని అన్నాడు.

జగదంబ ఒకసారి నిట్టూర్చి 'జే అప్పయ్యశాస్త్రులుగారి మనుమడి సంబంధం ఒహటి ఉందని వినవచ్చింది, మీరోసారి పోయి వరుణ్ణి చూసుకురండి' అని అంది.

కాంతారావు—'పోడానికి తీరికే చ్చెప్పు! చూశావుకద ఒకనాడు ఏదో వెళ్లి చూడఃపోతే ఎంతపని జరిగిందో! వర్కుల్ సంగతి ఇల్లా ఉందా? ఇహ తాండవశాస్త్రిగారి యింట్లోంచి కబు రొచ్చింది,—ఆయన మరదలికి చాలా జబ్బుగా ఉందని.

జగదంబకు కొంచెం విస్మయం కలిగింది,—'ఎవరికీ? మీనాక్షికి జబ్బా? అవిడెకు మళ్లా ఏం రోగం?' అని అన్నది.

'పైత్యం పైత్యం, ఊరికే పైత్యం! ఆహారదోషంవల్ల అజీర్ణం! డోకులు డోకులు! వర్కుల్ దగ్గరికిపోయి తిరిగి వచ్చేటప్పుడు ఆదారే వాళ్లింటికెళ్లి ఒకమాత్ర——

'ఆమెకు మందు లివ్వడానికి చాలామం దున్నారు గాని, మీ కాళ్ల కుకుంటూ ఒక్కసారి వైకుంఠపురం వెళ్ళిరాండి. పెళ్ళికొడుకు నొకసారి చూచుకొని అమ్మాయి కేదో ఉపాయం చూడండి.'

భార్యతాలూకు కంఠస్వరం కన్నీళ్ళు గారడంవల్ల ఎల్లాగో వికృతంగా ఉంది. అది బహుశా కాంతారావుగా ఏలాగో ప్రకృతిలో పడేసి ఉంటుంది, అత డిల్లా అన్నాడు—'ఏమిటీ వైకుంఠపురమా? అతడు చాలా ప్రబుద్ధుట్టే! ఎప్పుడూ నిషామీదే ఉంటాట్టే!'

జగదంబ ఇహ ధైర్యం ఆపుకోలేకపోయింది—'ప్రబుద్ధుడే కానీండి, నిషామీదే ఉంటనీండి, పిల్లదాని మెళ్ళో మంగళసూత్రం కనబడితే చాలు! అయితే మీ కేం మహాతక్కువా? ఇషువంటి మీచేతిలో మా తల్లిదండ్రులు నన్ను పెట్టినప్పుడు మీరుమాత్రం ఎందుకు పెట్టలేరు?' అని ఆమె పయట కొంగుతో కన్నీళ్ళు తుడుచుకుంటూ తుడుచుకుంటూ ఇంట్లోకి వెళ్లి పోయింది.

మాట పడిపోయి క్షణకాలం చూస్తూ కూచొని కాంతారావు కొంతసేపటికి పుస్తకం మూసేసి దీర్ఘంగా ఒక నిట్టూర్పువిడిచి—'ఇద్దరూ

ఇద్దరే సాంఘాతికరోగులు ఇప్పుడు,—ఇల్లా గాబరా చేస్తే ఏం రెమెడీ సెలెక్ట్ చేయడానికి వీలవుతుంది ?' అని మళ్లా ఒక నిట్టూర్పు విడిచి పుస్తకం చంకలో పెట్టి మెల్ల మెల్లగా బయటికి వెళిపోయాడు.



స్నాన సంధ్యావందనాలు చేసుకుని కొంచెం చాటుగా సాత్వికాహారం ఆత్మనివేదనం చేసేసి మూర్తిమంతమయిన బ్రాహ్మణ్యంలాగు తాండవశాస్త్రి మెల్లగా మెట్లు దిగి సూటిగా వాకట్లోకే బహుశా వేళుతూ, హఠాత్తుగా ఏం తోచిందో చూరుకిందనుంచి వరాండాపక్కగా తిరిగి పోయి వంటింటి కెదురుగా నిలిచి చాలా అకస్మికమయిన తొందరతో, 'ఈ మేళమంతా నీ కెందుకు పిల్లా,! జబ్బు ఒళ్లు కాదూ? కసవుకుప్పలతోటీ కూరనారలతోటీ కూచుంటే ఎట్లా? అందువల్లే 'ఒళ్లు ప్రధానమా? పని ప్రధానమా?' అని నే సెప్పుడూ అంటూఉంటా. 'శరీర మాద్యం ఖలు ధర్మసాధనం' అని అంటారు పెద్దలు' అని అన్నాడు.

కత్తిపీట ముందేసుకుని కూరలు తరుగుతూ కూచున్న మీనాక్షి కూరలు తరుగుతూనే కూచుంది. తాండవశాస్త్రి పాకోళ్ల ఘోరనాదం ఆమె చెవుల కెల్లా వినపడలేదో వేడుకతో కూడిన ఈ బ్రతిమిలాడడం కూడా అలాగే వినబడలేదు.

తాండవశాస్త్రి ఒక్కనిమిషం ఊరుకుని 'ఎల్లా ఉంది వ్యాపారం? ఈవేళపొద్దున ఎల్లా ఉంది' అని అడిగాడు.

మీనాక్షి మొహం మెత్తలేదు. చేతిలోని వంకాయమీదే చూపుంచి తల ఆడించి 'బాగానే వుంది' అని అంది.

తాండవశాస్త్రికి చాలా తుష్టి కలిగింది. 'మంచిది మంచిది, నాకు బాగా తెలుసు, కాంతారావు పిచ్చివాడే కానీ; మం దివ్వడంలోమాత్రం

ధన్వంతరి! కాని అతను చెప్పిన టైమ్ ప్రకారం మందు తినాలి. ఉపేక్ష చేస్తే లాభం లేదు. ఆమాట ముందే చెబుతున్నా' అని అన్నాడు.

మీనాక్షి దేనికీ జవాబు చెప్పలేదు. తల వంచుకుని తనపని తాను చేసుకుంటూ కూచుంది. తాండవశాస్త్రి కొంచెంసే పామెను ఆచిచూచి— ‹రెండు వేళలా చూచిపొమ్మని కాంతారావుతో గట్టిగా చెప్పాను. పొద్దున్న వచ్చాడా?' అని అడిగాడు.

మీనాక్షి తల వంచుకునే ‹ఆఁ' అని జవాబిచ్చింది. తాండవశాస్త్రి కులాసాతో ‹రాకపోడు, గాకపోడు, వచ్చి తీర్తాడు. నేనంటే అతనికి గురి సత్తియుండ ఎక్కడికి పోయింది? అతడు వచ్చి మందిచ్చిపోతాడు, నీ విట్లా పనిపాటలం పెట్టుకుని ఒళ్లు పాడుచేసుకుంటూవ్. నాకిదేం బాగా లేదు. పని బాగులవాళ్లందరూ ఏమయిపోయారు? ఈపను లన్నీ అతలికి తోసేసి నీవు పోయి పడుకో! పరమేశ్వరా! నీవే శరణు!' అని అతడు ఐహికాలూ పారలౌకికాలూ అయిన ఉభయకర్తవ్యాలూ కొంత చక్కబరుచుకుని బయటికి వెళ్లడానికి ఊహిస్తున్నాడు. అతని పాకోళ్లు కగిగి కొంచెం చప్పుడు చేసెయ్. మీనాక్షి ఉలికిపడి ఇంతసేపటికి మొహమెత్తి చూసింది. ఆమెమొహంలో ఆనాటి ప్రసన్నమైన చిరునవ్వు లేదు. ఈనాడా మొహం చింతా విషాదాలతో ఆచ్ఛన్నమై ఉంది. కళ్ళు రెండూ ఎర్రగా ఉన్నాయ్. రెప్పలచివర అప్పటికింకా కన్నీరు కనబడుతున్నట్టే ఉంది. అట్టి సజలదృష్టి నామె తాండవశాస్త్రిమీద స్థిరంగా నిలిపి హఠాత్తుగా ఇట్లా ప్రశ్నించింది.—

‹మీకు సంధ్యను పెండ్లి చేసుకుందామని వుందా? నన్ను మోసగించకండి, నిజం చెప్పండి.'

తాండవశాస్త్రికి గుటక దిగలా. వెనకముందాడి కొంచెంసేపటికి

కొలుకుని ‚ఏమిటీ? నేనా? సంధ్యనా? ఊ, హుఁ-హుఁ-హుఁ. ఎవరు చెప్పారు నీకు?' అని అన్నాడు.

‚ఎవరు చెప్తేం? పేరమ్మగారిని మీరు జగదంబగారి దగ్గిరికి పంపారా, లేదా? రేపు మార్గశిరంలో లగ్గం ఏర్పాటయిందా లేదా? దేవు డెదుట నున్నా డనుకుని నిజం చెప్పండి.'

తాండవశాస్త్రి అస్ఫుటంగా పళ్లు పటపటా కొరుకుతూ ‚పేరమ్మ చెప్పిపోయిందా? మంచిది మంచిది. దానిసంగ తేమో చూస్తా కాని నేను—'

‚అలాఅయితే మీరు న న్నన్నివిధాలా పాడుచేసి పెట్టారే. మొహం చూపడానికిగాని, నిలవడానికి నీడగాని నాకు లేకుండాపోయిందే' అని అంటూండఁగానే మీనాక్షికంఠం హృదయభేదకమైన రోదనంతో వెయ్యివిధాల దద్దరిల్లిపోయింది.

తాండవశాస్త్రి గడబిడపడి నలువంకలా పిరికిచూపులు చూచాడు. చేయెత్తి నోరడఁచుకుని ‚అవురవురా ఇదేం పని? అందరూ వింటూ రందుసు వింటారుసుమీ! ఇది వొత్తి కల్ల, కల్ల, గురు కల్ల. తమాషాకు—'

మీనాక్షి యేడుస్తూ—'తమాషా ఎన్నటికీ కాదు,—ఇదెప్పటికీ కల్లకాదు, ఇది నిజం, ముమ్మాటికీ నిజం. మీ రేదిబటితే అది చేయగలరు. మీ కసాధ్యమైనపని అంటూ లేదు' అని అన్నది.

‚కాదు కాదు, నామాట విను. ఇది పరిహాసం,—తమాషా,—మనమరాలి సరసం, ఔరౌరా కొంచెమూరుకో! ఇదుగో ఊరుకో! నవు కర్లూ-చాకర్లూ వస్తున్నారు' అని అంటూఅంటూ నుండేల్లాగా బెదురుతూ, బెదురుతూ తాండవశాస్త్రి కటకట ధ్వనులతో వాకట్లోకి పారిపోయాడు.

చేతిలో వంకాయ చేతిలో ఉండంగా మీనాక్షి బట్టకొంగు నోట్లో కుక్కుకుని పొర్లి పొర్లి వస్తూన్న యేడుపు నాపుకుంటూంది. అప్పుడు దాసీది గబగబా వచ్చి రోజుకుంటూ రోజుకుంటూ—'పిన్నమ్మగోరుండీ పిన్నమ్మ గోరూ! గుడ్డి తాతయ్యగా రా పాతదాసీదాన్ని వెంటబెట్టుకుని చ్ఛాయంగా వొచ్చారుండీ' అని అన్నది.

మీనాక్షి గబగబా కళ్ళు తుడుచుకుని 'ఏమిటీ?' అని అడగటానికి మొహ మెత్తింది. కన్నీటితో పలచబడి వెత వెదజల్లుతూన్న ఆమె చూపులుచూచి సత్తి నివ్వెరపోయి సిగ్గుపడి—'పిన్నమ్మగోరూ! ఆ పాత దాసీ దుండే, దాన్ని వెంటబెట్టుకుని గుడ్డితాతగారు, వారు మీ మామ గారే కాదుండీ, వారు మరిగత్తే ఇప్పుడే వొచ్చారు' అని అన్నది. ఈమాట విన్నతరువాత మీనాక్షి మొహంమీద కత్తి వేసినా నెత్తురు చుక్క లేదు. మృత్యువును ముఖాముఖీగా చూసినా ఎవరిమొహమూ ఇల్లా పాలిపోదు.

సత్తి భయపడి 'ఇల్లా ఉన్నా రేమండమ్మా?' అని అడిగింది.

మీనాక్షి ఈమాటకూడా జవాబుచెప్పక వెర్రిచూపులుచూస్తూ కూచుంది.

'మీకేదో జబ్బు చేసిన ట్లుందేమండీ?' అని సత్తి అంది.

మీనాక్షితల ఊపి ఇంతసేపటికి ఇల్లా అన్నది—'మామగారు వచ్చి ఎంతసేపయిందే సత్తీ!'

'ఏమోనమ్మా ఎంతసేపయిందో? వాకట్లో నిలబడి బాబయ్యగారితో మాట్లాడుతున్నారు, ఇప్పుడే చూశా పిన్నమ్మగోరండీ!'

మీనాక్షి ఆశ్చర్యపడి 'బాబయ్యగారితోనా?' అని అడిగింది.

‘ఆఁ. నేను బయట్నుండి వస్తుండగా బాబయ్యగారు నన్ను పిలిచి ‘సత్తీ! మామగా రొచ్చారు, మిమ్మల్ని తీసకపోడానికి’ అని మీ పిన్నమ్మగారితో చెప్పు’ అని సెల విచ్చారు. ‘ఓయమ్మా! ఇరుగో! అంటుండంగానే వొచ్చేశారు’ అని సత్తి కొంచెం తొలగి నిలబడ్డది. వెంటనే కర్ర చప్పుడువల్ల ఆ కర్ర పట్టుకొని వచ్చేవా రెవరో తెలిసిపోయింది. ఎంచేతనంటే ఆకర్ర పట్టుకున్నవారికి రాకపోకలకు కంటిమీదకంటె కర్రమీదే ఎక్కువ నిబ్బరం.

వెనువెంటనే నడివయస్సు దాటిన ఒక దాసీవెనకాల ఒక ముసలాయన కర్రపొడుచుకుంటూ పొడుచుకుంటూ ముందరికి వచ్చి—‘మాఅమ్మ ఎక్కడుందర్రా?’ అని అన్నాడు.

మీనాక్షి లేచి వచ్చి తలకు గుడ్డచుట్టుకుని ఆయన ముందు సాష్టాంగపడి లేచి నిలుచుంది. కళ్లు కనపడకపోయినా మొత్తమ్మీద అతడు చెహూరాను పట్టి లీలగా మనిషిని పోల్చగలడు. ఆయన ఆశీర్వదింపబోయి దుఃఖపారవశ్యంతో ‘ముసిలివాళ్లని మమ్మల్నిద్దర్నీ మరపించి ఎల్లా వొచ్చావమ్మా?’ అని అన్నాడు.

కూడా వచ్చిన దాసీది మీనాక్షికి దణ్ణం పెట్టి—‘అత్తగారు చావడానికి సిద్ధంగా వున్నారు,—మా కోడలిని చూపించండి, మా కోడలిని చూపించండి’ అని ఆమె నోటివెంట ఇదొక్కటే మాట. సరేకాని ఇన్నాళ్లు వారిని మరచి ఇక్కడెల్లా వుంటున్నారో కొంచెం చెప్పండి’ అని అన్నది.

మీనాక్షి ఈ నేరాని కేమీ సమాధానం చెప్పక ఒక చేత్తో కళ్లొత్తుకుంటూ మరొకచేత్తో ముసలాయన చేయుచ్చుకుని వసారాలోకి తీసికెళ్లి అక్కడో పీట వేసి అతణ్ణి ఆ పీటమీద కూచోబెట్టి నిశ్శబ్దంగా తల వంచి నుంచుంది.

పీటమీద కూచుని ముసలాయన ఇల్లాచెప్పడం మొదలేశాడు— ‘శాస్త్రుల్లుగారికి రెండుత్తరాలు రాయించాను. ఒకదానికీ సమాధానం రాలా. ఆయన చాలా గొప్పవారు. ఆయనకు తలవెంట్రుకలన్ని పనులు. మాబోటి పేదవాళ్లకు జవాబు రాయాలని తోచుబడి అవడానికూడా వీలుండదని మనస్సులో అనుకున్నాను. కాని మా కోడలు తల్లే మా పేదయింటికి లక్ష్మి—

ముసలాయనమాట సాగనీయక నడుమ జొరబడి దాసీ దిల్లా అంది- ‘కానీండి మీబావగారు మహా గొప్పవారయితే! ఎవరు కావద్దన్నారు? ఆలా అని ఒకరింటికోడల్ని ఎన్నాళ్లు తమయింట్లో ఉంచుకుంటారు? ఆసంగతి మీరే చెప్పండి! అది సరేకాని ఎవరికే మీరింత కాచిపోదామని వచ్చారో ఆ అప్పయ్యగారు పోనే పోయారు.—

ముసలాయన—‘ఆగాగు నరిసీ! ఈ మాటలన్నీ యెందుగ్గాని, అమ్మాయీ మీన్నా! మీ అత్త రేపోమాపో అనేట్టుంది. ‘నాకోడల్ని నాకళ్లకోసారి చూపండర్రా’ అని వాగడమేకాని ఆగడ మెరగదు. ‘ఇవ్వాళ మంచిరోజు; ఈరోజే తీసుకొచ్చి నాకు చూపండి’ అని మొర్రోమంటే బయలుదేరొచ్చాం’ అని అన్నాడు.

నరిసి—‘మీకోసమే ఆమె ప్రాణాలింకా పోక పెనగులాడుతున్నయ్ అప్పయ్యగారూ! ‘నరిసీ! నీవైనా పోయి మాఅమ్మిని నాకళ్ల కొక్కసారి చూపవే అని వాపోతున్నా రమ్మా!’ అని ఇల్లా చెపుతుండగా దాని స్వరం కరుణతో ఆర్ద్రమై పోయింది.

ముసలాయన—‘తాండవశాస్త్రుల్లుగారికి నా ఉత్తరా లందలేదని నాకు తెలీదు. ‘ఎందుకు జవాబురాదా ఎందుకు జవాబు రాదా?’ అని మహా ఆలోచించాం. కాని తాండవశాస్త్రుల్లుగారు నిషధయోగ్యుడు: వినగానే ఏమన్నా రనుకొన్నావ్?—‘బాగా వుండిపాయె; మీ కోడలిని

మీరు తీసుకెళితే ఎవ రొద్దంటారు ?' అని అన్నారు. ఇల్లా అనడమే కాకుండా వెంటనే బోయీలనూ మేనాను సిద్ధం చేయించారు. పాపం మీ అత్తగారి జబ్బుమాట విని 'నా ఆపత్కాలంలో మీనాక్షిని మీరు పంపారు; మీ ఆపత్కాలంలో మళ్ళా పంపేయడాని కాపత్తి చెప్పే పాపండు డెవడయినా ఈ ప్రపంచకంలో ఉంటాడా ? మీ రిప్పుడే ప్రయాణం చెయ్యొచ్చు, అందుకు తగ్గ బందోబస్తంతా చేస్తా' అని అన్నారు.

మీనాక్షి ఇంతవరకూ నోరు మెదల్పలేదు. ఆమె మొహం మకస్మాత్తుగా వెలాతెలా పోయింది. 'తాండవశాస్త్రిగారే ఇల్లా అన్నారా ? ఇప్పుడే పంపేస్తామన్నారా ? ఇప్పుడేనా ఇప్పుడేనా ?' అని అన్నది.

నరిసి ఉత్సాహంతో ఇల్లా అంది—'ఆఁ. ఇప్పుడే పంపిస్తా మని అన్నారు. "పంపకేమండీ ? వెంటనే మంచిమాట చేసేనుగుని ఈ మూడు గంటలబండి అందుకుంటే తెల్లారేసరికల్లా యింటికి పోవచ్చు" అనికూడా అన్నారు. ఆయనగారిలోప మేమీలేదు. మనం వెళ్ళేసరికీ ఆమెగారిస్థితి యెల్లా వుండబోనో ? ఒక్కనిమిషమయినా ఆలస్యం చేయడానికి వీల్లేదు. ఆమె 'రామరామా' అని అనుకుందుకు బదులు 'అయ్యో కోడలా అయ్యో కోడలా' అని వాపోతూ మీదారిమీదే రెండుకళ్లూ పెట్టుకున్నా-చున్నారు.'

మీనాక్షి మళ్ళా—'తాండవశాస్త్రిగారే ఇల్లా అన్నారా ? ఇప్పుడే పంపేస్తారా ? ఇప్పుడేనా ? ఇప్పుడేనా ?' అని మరబొమ్మలాగా ఆమాటలే అవృత్తి చేసింది.

ముసలాయన తల పంకించి—'జానమ్మా ! ఇప్పుడు కాకపోతే ఇంకా యెప్పుడు ? ఆగడానికి వీలులేదమ్మా' అని అన్నాడు.

నరిసి ఆపుకోలేకపోతూంది. దాని కంఠస్వరంలో ఆ సంగతి బయటబడకుండా ఉండలేదు. అది ఇల్లా అంది—'ఏమిటండీ అలాగంటారు

అప్పయ్యగారూ! అత్తగారు చావు బతుకులమీ దున్నారు. తమకోదలిని తమయింటికి తీసకపోవడానికి మామగారు సాయంగా వొచ్చారు. ఇహ పంపని వా రెవరో చెప్పండి! అదీగాక ఇంకా ఇక్కడ ఉండడం ఎందుకో చెప్పండి! సరేగాని మీభావగారికే పిలిచి భోగట్టా చేయండి పోనీ!'

కాని భావగార్ని పిలవ నక్కర లేకపోయింది. ఆయన ఆప్రాంతా లలోనే ఎక్కడో నక్కిఉన్నాడు కాబోలు; పాళోళ్ల చప్పుడుతోపాటు ప్రత్యక్షమై నిలుచున్నాడు. చాలా గందరగోళంగా కనబడుతున్నాడు. అతడు ముసలాయన నుద్దేశించి ఇల్లా అన్నాడు—'అయ్యా మాటలు పెట్టు కూర్చుంటే ఇహ పని అయినట్టే! ఎండెక్కింది. స్నానమూ, సంధ్యావం దనమూ, దేవతార్చనా చేసుగుని బయలుదేరేసరికి రైలువేళ అవుతుంది. కొంచెం మిగిలిందా అంటే వర్జ్యం. సరే, పంపడానికి నాకేమి అభ్యం తరం? బాగుండి పోయె! మా కొంచెం కష్టం కలిగితే కలిగె! అల్లా అని మీపిల్లను మీకు పంపకుండా ఉండడమా? ఎంతమాట? అత్తగారికి పాపం ప్రాణం మీది కొచ్చె; నాకెంతో జంజాటమూ, ఎన్నో పనులూ! ఎందరో ఇంటిముందు! నా కూపిరి తీసుకోవడానిక్కూడా తీరుబాటు లేదుగాని లేకపోతే నేనే మీనాక్షిని వెంటబెట్టుకుని మీయింట్లో దింపి వచ్చేవాణ్ణి! మీ ఉత్తరం ఒక్కటయినా అందితే ఒట్టు! మీచీటి అందివుంటే మీకి కష్టం లేకుండా పోయేది. పాపం మీ రింత దూరం రావలసిన పని ఉండేది కాదు. బ్రాహ్మ డేడీ? గోవిందూ! నీళ్ళు తోడు! అచ్చమ్మా! వీరికి మడి బట్ట! గోకర్ణం ఉద్ధరిణీ అన్నీ అక్కడ పెట్టండి! అయ్యా! మీ రిహ తొందరపడాలి! మీనాక్షీ! ఆలస్యం చేయకు. రైలువేళ దాటిపోతుంది. ఎవరదీ? మళ్లా రెడ్డెమ్మా? అయ్యా! మా ఆవిడ గతించిందిమొదలూ మతి మతిలో ఉండదు. ఏమీ తోచదు. నారాయణా శరణు! పరమే శ్వరా! శరణు!' అని యిల్లా అంటూ తాండవశాస్త్రి దారంతా చప్పుడు చేసుకుంటూ వెళ్ళాడు.

మీనాక్షి యేమాటకూ జవాబియ్యక తాండవశాస్త్రి పోయిన దారే చూస్తూ రాతిబొమ్మల్లే నిలబడిపోయింది.

చాకలి రత్తిగాడు వచ్చి 'చిన్నమ్మగారూ! చినబాబుగారు ఏటికి తీసకపొమ్మని ఏడిపిస్తున్నారండీ! తీస్కెళ్లి తానం చేయించుకుని తీస్కరామండీ?' అని అడిగాడు.

మీనాక్షి వెనుకటిమల్లేనే కదలక మెదలక నిలుచుని ఉంది. ఈ నవుకరుదరఖాస్తు ఆమె చెవినిపడ్డట్టు కనిపించడం లా.

ముసిలిమామగారు మెల్లమెల్లగా నేలమీద చేతులుమోపి లేచి—'అమ్మా! నేను లేస్తున్నాగాని నీవుగూడా నీపని తొందరగా తెముల్చెయ్' అని అన్నాడు.

నరిసి—'ఈరోజు నా కాదివారం'—

మీనాక్షి గభాలున వెనుదిరిగి 'నేను రాను' అని అన్నది.

మామగారి కాశ్చర్యం కలిగింది. 'రావూ? ఏమిటమ్మా? నేడు బహు మంచి రోజు' అని అన్నాడు.

నరిసి తన ఆదివారపు ఫలాహారపుమాట చెప్పడం మరిచిపోయి, 'జోస్యులుగారి దగ్గిరికెళ్లి వారమూ వంగడమూ అన్నీ విచారించుకొనే మరీ వచ్చానండీ! ఈలాటి రోజు మళ్లా లేదు' అని అన్నది.

'నేను రాను, నే న్రావడానికి వీలులేదు' అనిమాత్రం మీనాక్షి అంది.

తాండవశాస్త్రి కొడుకు పదేళ్లవాడు. అతడు పరుగెత్తుకుంటూ వచ్చి మీనాక్షిమీద పడి 'చిన్నమ్మా! ఏటికి పోనివ్వవ్? తీసికెళ్లమని చెప్పవ్ రత్తిగాడితో? నేన పోతానే, నేను పోతా. ఏం? ఏం? అంటానే—'

మీనాక్షి ఎవరికిగాని ఏ సమాధానంగాని చెప్పక కేవలమూ ఆ దుడుకుకుర్రవాణ్ణి బలంగా ఎదురొమ్మున అదచిపట్టుకుని ఊ హుఁహుఁహుఁ అని మెల్లమెల్లగా రోదనపారాయణం చేసింది.

౯

అటుపిమ్మట మీనాక్షి ఏగదిలోకి వెళ్లి లోపల గడియ వేసుకుందో ఆగదిగడియ మరి తీయబడలేదు. ముసిలి గుడ్డిమామగారు ఆ మధ్యాహ్నమల్లా మతి పోయినవానిచందంగా మాటాడకుండా కూచునికూచుని మెల్లమెల్లగా వాకిట్లోకి వెళిపోయాడు. నరిసికూడా అతనితో వెళ్లింది. మీనాక్షి. తానురానని చెప్పడానికి హేతు వేమిటో ఎంత కొట్టుకున్నా తెలియలేదుగాని నరిసి ఎంతచెడ్డా ఆడదికదా, ఊరికే తిరిగిపోవడం దానికి నచ్చలేదు. నచ్చకపోవడం ఏమిటి? ఊరికే వెళ్లడం దానికి చేతకాలేదు. అది మీనాక్షి గదిముందుకు వెళ్లి అన్నమాటలు అంత చక్కటివి కావు, అంత కమ్మటివి కావు, కాని మీనాక్షి కిమన్నాస్తి. ఏడుపులో నిట్టూర్పుకూడా ఆవిడే పయికి సాక్యనీయలేదు. తాను పన్నెండోఏటే విధవ అయింది. నాటినుంచీ అత్తగారే పెంచి పెద్దదాన్ని చేసింది. ఆమె ఎన్నడూ తనకు కష్టం కలిగింపలేదు. అట్టి అత్తగారిప్పుడు చావుకు సిద్ధంగా ఉంది. తనను చూస్తేగాని ఆవిడ ప్రాణాలు పోయేటట్టు లేవు. ఇంతే కాకుండా తనకు మగతల్లివంటి ఈ మామగారు శతవృద్ధూ, అంధుడూ, తన కోసం వచ్చి వట్టిచేతులతో వెళిపోయాడు,—ఇటువంటిసందర్భంలో తా నల్లా ఆగదిలో ఈ దుఃఖ మంతా భరిస్తూందో ఆసంగతి ఆపరమేశ్వరుడికే తెలియాలి. అతడుతప్ప మరి సాక్షి లేడు.

ముసలాయన వెళిపోతూండంగా తాండవశాస్త్రి, దగ్గిరకు వెళ్లి దారిబత్తెం పంపిస్తా నం దం దని మనవి చేసుకున్నాడు. మీనాక్షి రా

నవడంవల్ల తాండవశాస్త్రికి కలిగిన ఆశ్చర్యదుఃఖాలు ముసలాయనకు కలిగిన ఆశ్చర్యదుఃఖాలును దాటిపోయెయ్.

తాండవశాస్త్రి చావడిలోకి వచ్చి మృత్యుంజయ అవధాన్లు కూచుని ఉండడం చూచాడు. మృత్యుంజయావధాన్లు లేచి నమస్కారం చేశాడు. తాండవశాస్త్రి తిరిగీ నమస్కరింపక తల కొంచెం ఊపి 'మీతో కొంచెం పని వుండి కబురు పంపా నవధాన్లగారూ!' అని అన్నాడు.

'దేవతార్చన అయి 'సత్యం త్వర్తే' అంటూండగా తమ కబురందింది. రెండు మెతుకులు ముక్కునా నోటనా కొట్టుకుని ఆపళంగా వచ్చా.'

'ఆలాగా? సరి. మీరు పెళ్లిపేరంటాలు చేయిస్తూ దేశాలన్నీ తిరుగుతూవుంటారే, దేశంలో వార్తలూ విశేషాలూ భోగట్టాలో ఉంచుతారా? ఘటకుడంటే ఘటకుడు మీ తాత. దేశంలో ఎక్కడ పెళ్లయినా ఆయనచేయి లేనిదే ముడిపడేది కాదు. సంఘ మంతా ఆయన నఖదర్పణంలో ఉండేది.'

'చిత్తం, అందుకు లోటు లేదు. అయ్యా! ఇవా ఆడాళ్ల పనులు? అ దల్లా ఉండనీండి,—జగదాంబకూతురు సంధ్య, దాని కెంత పొగరో చూడండి. పేరమ్మపిన్ని చెప్పిందగ్గిర్నుంచీ నావొళ్లు మండుకుపోతూంది.'

'ఏమి టేమి టా సంగతి?' అని చాలా ఆశ్చర్యంగా తాండవశాస్త్రి అడిగాడు.

'మీ రేమీ వినలేదా?'

'లేదు లే దేమీ వినలేదు, ఏమిటాసంగతి?'

'తమ యిల్లూ ఇప్పుడు శూన్యంగా ఉండె; ఆ పిల్లకా పెళ్లికా లేదాయె. తమరు దయతలచి రెండు తలంబ్రాలు పోసి బ్రాహ్మణకులం

రక్షింప బూనుకున్నా రని విన్నా. దుంటెగ పిల్ల పదిమందిలోనూ—అయ్యా చెప్పడానిక్కూడా నోరు రావడం లేదు, కాని, క్షమించాలి,—'ఆ వచ్చినవాడి మెడలో చిరుగు చెప్పులదండ వేస్తానందిట! తల్లిదండ్రులు కూడా దానికి ఒత్తాసు చేశారట'

కోపంచే తాండవశాస్త్రి కళ్లూ మొహమూ ఎఱ్ఱబడ్డయ్. కాని ఒక్కనిమిషంలోనే అతడు తనను కుదటబరచుకుని హహ్వాహ్వాహ్వా అని నవ్వి—'ఏమిటీ అలా అన్నదా? అది వొట్టి వాగుబోతు లెండి.' అని అన్నాడు.

కోపం వచ్చి మృత్యుంజయావధాన్లిల్లా అన్నాడు 'వాగుబోతయితే మిమ్మల్నిల్లా అనడమే? మీపాదా లట్టుకుంటే తన సప్తసప్తపురు షాంతరాలూ తరిస్తయ్యని దానికి తెలియదు! ఏమి సెలవు?'

తాండవశాస్త్రి శాంతంగా నవ్వుతూ ఈలా అన్నాడు—'తెలియని పిల్ల! కసరుగాయ! అవధాన్లూ! మనం కోపగించరాదు. సామర్ధ్యాద దాని కేం తెలుసు? నీకు తెలుసు, మీకు తెలుసు, ఈ పదూళ్లకూ తెలుసు, లోకానికి తెలుసు; కసరుగాయ దాని కేమి తెలుసు?'

మృత్యుంజయావధాన్లు అతికష్టంతో స్వరం తగ్గించి—'అల్లాగయితే తమరు, పేరు పిన్నిగారి ద్వారా జగదంబకు కబు రంపిన మాట నిజం కాదూ?' అని అడిగాడు.

తాండవశాస్త్రి—'నారాయణ నారాయణ! నీక్కూడా వెఱ్ఱెత్తిందా యేమోయ్? ఆ గృహలక్ష్మి పోనే పోంగా మళ్లా ఇంకో,—' అని ఇంతమాత్రం పలికి అకస్మాత్తుగా నిట్టూర్చి—'నారాయణా శరణు శరణు' అని భక్తి గద్గదమయిన తన నిట్టూర్పుకు మృత్యుంజయావధానేమంటాడో చూతామని కేవలం అతని మొహం చూస్తూ ఊరుకున్నాడు.

కొన్ని నిమిషాలిట్లా చూచిచూచి ఉదాసీనకంఠంతో—'ఇదంతా తుట్టు. ఇదేమాత్రమూ నామనసులోకి ఎక్కనే ఎక్కదు. 'అతన్ని రక్షించండి, ఇతణ్ణి బతికించండి, అతని కులం కాపాడండి' అని లోకులు నన్ను రేయుం బవళ్లూ పీక్కుతింటారు. కానయితే మనస్సిమితం లేక ఎవరితో నయినా అంటే అన్నానేమో! పరమేశ్వరా నీవే శరణు! నీవే గతి!

మృత్యుంజయావధాన్లకు కావలసింది దొరికింది. అత డతివినయంగా ఇలా అన్నాడు—'అవునయితే మా సత్యనారాయణావధాన్ల కూతురు పదమూడు పధ్నాల్గేళ్లది. దాని కన్నెచెర తమరు తప్పించాలి. పిల్ల ఎంత అందగత్తె అనుకుంటున్నారు?'

'నీ వెంత వెర్రివాడవోయ్ మృత్యుంజయావధాన్లూ! ఇవన్నీ పెట్టుకున్నుంటే నాకేం బావుంటుందోయ్! సరే కాని అప్పుడే పిల్లకు పధ్నాల్గేళ్లొచ్చాయా? అయితే కొంచెం బొద్దుపిల్ల అని విన్నానే.'

మృత్యుంజయావధాన్లకు ఉత్సాహం కలిగింది. ఇలా అన్నాడు—'చిత్తం, చాలా బొద్దుపిల్ల. ఇంతే కాకుండా అది యెంత నిమ్మళస్తురాలో అంత అందగత్తె టుమండీ.'

తాండవశాస్త్రి మెత్తమెత్తగా నవ్వి—'నా కింకా అందచందాలు! నా కింకా రూపురేకలు! సాక్షాత్తూ లక్ష్మినే కోలుపోతినిగదా! నారాయణ నారాయణ! ఎవరికి దుఃఖం కలిగినా ఓపలేను. వింటే దుఃఖం ఆపుకోలేను. అయితే పదమూడు పధ్నాల్గేళ్లని మీ రన్నప్పుడు ఇంకో రెండేళ్లు వేసుకుని పదిహేను పదహారేళ్లుండవచ్చునని అంచనా వేసుకోచ్చు. బ్రాహ్మడు చాలా ఆపత్తులో పడ్డాడని చెప్పవద్దూ పాపం!' అని అన్నాడు. మృత్యుంజయావధాన్లు తల తిప్పి 'సందేహ మేముంది?' అని అన్నాడు.

తాండవశాస్త్రి ఇలా అన్నాడు—'నాకిదంతా తెలుసునయ్యా అవధాన్లూ! కులీనుడి కులం కులీనుడే కాపాడితీరాలి. అట్లా కాపాడక పోవడం చాలా దోషం. కాని నావిషయం చూస్తే ఒక వేపు శోకమూ తాపమూ, ఇంకోవేపు, ఏళ్లై దగ్గిర దగ్గిర కొచ్చాయ్,—అయితే నా స్వభావమేమిటో నాకే తెలీదు. ఇతరుల కాపద కలిగిందని వింటే నాకే ఆ ఆపద వచ్చినట్లుంటుంది;—కాదు అనే మాట నానోట రాదు.'

మృత్యుంజయావధాన్లన్నింటికీ తల తిప్పడం మొదలుపెట్టాడు. తాండవశాస్త్రి మళ్లా పొడుగ్గా నిట్టూర్చి ఇల్లా చెప్పడం మొదలుపెట్టాడు—'స్వభావశుద్ధమయిన ఈ గ్రామంలో సమాజానికాధిపత్యం వహించడ మన్నది ఎంత చిక్కులమారి పనో అది నాకే తెలుసు. ఎవరికి నూకలు లేవో ఎవరికి గుడ్డలు లేవో ఎవరికి వైద్యం తిన్నగా జరగడం లేదో ఇవన్నీ కనుక్కోవలసి ఉండడం అటుండంగా ఇప్పుడీమాదిరివన్నీ వచ్చి నెత్తిమీద పడితే బతకలేనోయ్ మృత్యుంజయా' పాపం సత్తెనారాయణావధాన్లు గర్భదరిద్రుడు,—అయితే అతనికూతురికి పెళ్లియీడు తప్పిందేం? పిల్ల పద్దాలు గేమిటి? పదిహేను పదహారింటికి జంకడు, పోనీ ఒకసారి నన్ను చూడమని ఆయనతో అనలేకపోయావా?

మృత్యుంజయావధాన్లు తొందరపడి 'ఇప్పుడేవెళ్లి ఆయన్ని పంపిస్తా. లేకపోతే కూడా వెంటబెట్టుకు రమ్మంటే వెంటబెట్టుకొస్తా' అని అన్నాడు.

తాండవశాస్త్రి ఉదాసీనస్వరంతో ఇలా అన్నాడు—'ఆయన్ని అలాగే పంపు. కాని చాలా చిక్కుల్లో పెట్టావోయ్ మృత్యుంజయా!,—పేదబ్రాహ్మడికి సంభవించిన ఈ విపత్తులో 'ఊహుఁ.' అని ఎల్లా చెప్పేదోయ్? పరమేశ్వరా! 'త్వయా హృషీకేశ హృది స్థితేన!' నీ వేది చేయిస్తే అదే చేయవలసుంటుందీ, మేము నిమిత్తమాత్రులం, అంతకంటె వేరే యేమీ లేదు.'

మృత్యుంజయావధాన్లు వింటూ కూచున్నాడు.

తాండవశాస్త్రికి ఏదో ఒకసంగతి మనస్సులో గోచరించినట్టయింది. 'ఇదిగో చూడు, నిన్నెందుకు పిలిచానో ఆసంగతి ఇంతకూ చెప్పనే లేదు. ఈనెల చాలా కటకటీగా ఉంది, నీనోటుబాపతు వడ్డీ—!'

మృత్యుంజయావధాన్లు చాలా దీనంగా 'ఈనెలమాత్రం తమరు క్షమించం కరుణించకపోతే—

తాండవశాస్త్రి—మంచిది మంచిది, అలాగేలే, అలాగేలే. కష్టపెట్టి ఒక దమ్మిడీఅయినా తీసుకోడం నాకు గిట్టదు. అయితే, ఇదిగోనోయ్! నీవల్లకూడా నా కోపని కావలసిఉంది' అని అన్నాడు.

మృత్యుంజయావధాన్లు మొహం చేటంత చేసుకుని 'చిత్తం, సెల విప్పించండి' అని అన్నాడు.

తాండవశాస్త్రి—'సనాతన హిందూమతం నిలిపి సమాజాన్ని రక్షించుకుంటూపోవడం సామాన్యమైన పని కాదు, మృత్యుంజయావధాన్లూ! ఈ మహాభారం ఎవడు నెత్తిన పెట్టుకుంటాడో వాడు వేయి కళ్లు పెట్టుకు చూడాలి, వేయిచెవులు పెట్టుకు వినాలి! కాంతారావు తల్లినిగురించి ఏదో ఒక గోల ఉందని విన్నా! నీవు వాళ్ల ఊరికి పోయి ఈసంగతి అతిజాగ్రత్తగానూ అతి రహస్యంగానూ తెలుసుకుని రావాలి. మీ తాతగారెట్టివా డనుకున్నావ్? ఆయన కిరవై మూడూళ్లసంగతు లన్నీ కంఠపాఠం. వెనక వెంకటరామయ్యగారింటికి పదేళ్లపాటు చాకళ్లనూ మంగళ్లనూ పోకుండా చేశాకే—తుదకా అపాత్రుడు 'దేముడా' అనుకుంటూ ఊళ్లోంచి లేచిపోయాడే—అప్పుడు మీ తాతగారి సహాయమే సహాయం. ఆయనగారి అండదండలే నాకు. కాని ఆయనగారి కీర్తి నీవు నిలపలేకపోయావని నీముందే చెప్పేస్తే మంచిది.' అని అన్నాడు.

మృత్యుంజయావధాను తన పూర్వపురుషులతో తులతూగలేక పోవ డానికి చిన్నబుచ్చుకుని 'అయ్యా ఇదుగో వారంగోజుల్లో వాళ్ల కడుపుల్లో ఉన్న రహస్యాలన్నీ లాక్కురాకపోతే చూడండి' అని అన్నాడు.

తాండవశాస్త్రి ప్రోత్సహిస్తూ ఇల్లా అన్నాడు—'ఎబ్బే నీవు లాక్కొస్తావ్, తప్పక లాక్కొస్తావ్. మీ వంశ మెటువంటిది?—అలాటి వంశంలో పుట్టినవాడు, ఊరికే పోడు. కాని ఒకమాట. ఈసంగతి అయిదో చెవిలో పడకూడదు;—ఈసంగతి నీసందునా నాసందునా మాత్రమే రహ స్యంగా ఉండాలి. సంఘంతాలూకు మానమర్యాదలను రక్షించవలసివస్తే చాలాచాలా వివేచించాలిసొస్తుంది. ఇదిగో చూడు, వడ్డీమాత్రమే కాదు, అసల్లోకూడా ఆలోచిస్తా; కష్టాల పాలయినావ్, ఈసంగతి లోకటాకే తెలిపితే—

మృత్యుంజయావధాన్లు పులకితుడై లేచి నిల్చుని 'తమ చిత్తం తమ చిత్తం, నేను తమ పాదాల 'సన్నిధానంలోనే వుండుకున్నా, నే నిది విచా రించుకుని రావడానికి చీకటితోనే లేచి పోతా,' అని వెళ్లబోయాడు.

తాండవశాస్త్రి నాలుక కొరుక్కుని—'అంత మాటనకు అవ ధాన్లూ! నేను నిమిత్తమాత్రుణ్ని.—ఆయన శ్రీ చరణాలముందు కీటాను కీటంలాగా పడిఉన్నా' నని ఆకాశంకేసి శివనేత్రంపెట్టి రెండు చేతులూ జోడించి నమస్కారం చేశాడు.

మృత్యుంజయావధాన్లు రెండడుగులు వేశాడు, మన స్థిమితంలేని తాండవశాస్త్రి మాటాడుతూ ఇలా అన్నాడు—'ఇదుగో చూడు, పత్తె నారాయణావధాన్లని పంపడం మరిచేవ్‌గనుక. బ్రాహ్మడు చిక్కులో ఉన్నాడని విన్న దగ్గిర్నుంచీ నా ప్రాణాలు కొట్టుకుంటున్నయ్. నారా యణా నీవే కాపు! పరమేశ్వరా! నీవే ప్రాపు!

# ౧౦

సుప్రసిద్ధులయిన జయ-అప్పయదీక్షితులవారి దౌహిత్రుడు వీరేశ్వర దీక్షితులకే సంధ్య నిచ్చి, పెండ్లిచేయడం స్థిరమయిపోయింది. రేపొద్దున్నే పెండ్లికొడుకుతరఫువారొచ్చి తాంబూలాలు పుచ్చుకుంటారు. అందుకు కావలసిన సన్నాహం ఈ యింట్లో యిప్పుడు జరుగుతోంది. మూఢం ముందుండడంవల్ల లగ్నం చాలా దాపుగా నిశ్చితమయింది. ఎన్నిమారులు ప్రార్థించినా రాని అత్తగారు అతికష్టమ్మీద ఈ పెళ్లి కని ఇవాళ్లకు కాశీనుంచి వచ్చారు. చీకటిపడ్డాక వంటింట్లో దీపంపెట్టి జగదంబ పెండ్లికిగాను పిండివంటలు చేయడానికి కూచుంది. ముదుసలి అత్తగారు సోమమ్మ దాపున చిత్రాసనముమీద కూచుని రుద్రాక్షలు తిప్పుతూంది. శీతాకాలం ఆరంభమయింది. ఆమె ఒక జేగురుగుడ్డ కట్టుకుని. ఒక జేగురు శాటీ కప్పుకుంది. సోమమ్మ కొంతసేపటికి రుద్రాక్షలు తిప్పడం ఆపి కోడలిని చూచి, 'లగ్నానికి ఇహ పదిరోజులే వ్యవధానం కాబోను' అని శాంతస్వరంతో అడిగింది.

జగదంబ మొహమెత్తి 'ఏదండీ ఇవ్వాళతో తొమ్మిది రోజులే. కార్యమయిపోతే బతికి బైటబడతా. ఈ పాడుదేశంలో ఏ కార్యమయినా రనెవేరిందాకా నమ్మకం లేదు' అని అంది.

అత్తగారు కొంచెం నవ్వి—'మా ఒక్క ఊళ్లోనే కాదమ్మా అన్ని ఊళ్లలోనూ అన్ని దేశాల్లోనూ ఇల్లాగే వుంది. అయితే ఈ బంగారపు లక్ష్మివిగ్రహాన్ని నీళ్లలో వదిలేసి వచ్చేటప్పుడు ఈ కార్యం నెరవేరిందాకా నమ్మకం లేదని అనుకోవడం యెందుకమ్మా? అని అన్నది.

జగదంబ తన పనిమీదే ఉందికాని ఇందుకు ప్రత్యుత్తరం చెప్పలేదు.

అత్త ఇల్లా అంది—'మా వాడు కాంతయ్య నాకన్నీ సంగతులూ చెప్పాడు. పొద్దున్నే స్నానానికి పోతూ పద్మలవారి దక్షిణామూర్తిని చూశాను. ఏం కోడలా! చంద్రుడల్లా వుంటే నీ కతను నచ్చలా?'

జగదంబకు ఇందువల్ల అంతగా సంతోషం కలగలా.—'నచ్చినంత మాత్రాన అంతా అయినట్టేనా?' అని అన్నది.

అత్త ఇల్లా అంది—'కాదుగాని నేను స్నానంచేసివచ్చి నాశక్తి కొలది సాధ్యచే చెప్పించగలిగిన కొద్దిసంగతులవల్ల నాగుండెలు పగిలేయ్. నీవు తల్లివై కూడా ఈసంగతి కనిపెట్టలేకపోయావా?'

ఆమె కనిపెట్టకపోలేదు. కాని ఒప్పుకోడంమాత్రం అసంభవం. ఇంతేకాకుండా అవిడే భయంతో అటుకూ ఇటుకూ చూచి గొంతుక అడచుకొని—'అత్తా! ఇది పనిసమయం. వాళ్ళూ వీళ్ళూ వచ్చి వినిపోతారు ఊరుకోండి' అని అన్నది.

అత్తగారు మరి మాట్లాడలేదు కాని జగదంబ తన స్వగత కటుత్వానికి తానే సిగ్గుపడి మెల్లిమెల్లిగా ఇల్లా అంది—'సరేకాని అత్తా! మీ రెట్లా ఈమాట మాట్లాడతారు? మీ కులమర్యాద నంథా కూలదోసి లోకం ముఖం ఎట్లా చూస్తారో కాస్త చెప్పండి. ఇంతేకాక అతనికి కులం కూడా లేదాయెరి. ఈ మాటలన్నీ మీదగ్గర చెప్పడానికి వకాల్తా పుచ్చుకున్నవారు ఈ కాసంతమాటా మీ చెవిలో పడెయ్యకపోయినారేం?'

ఇహ అడగడానికిగాని చెప్పడానికిగాని ఏమాత్రమూ పని ఉండదని జగదంబ అనుకుంది గాని సోమమ్మ తలతిప్పి—'పడెయ్యకపోవడమేం? పడెయ్యకల్లా ఊరుకుంటారు? పడెయ్యనే పడేశారుకాని కోడలా! నీ వనుకొన్నట్లతని కేమీ లేదనుకోవడం పొరపాటు. అంథా సరిగ్గానే ఉంది. అతనికి విద్యా బుద్ధు లున్నవిగదా అనే నే ననడం లేదు. అలికీజాతివాళ్ళని

మీరు వెళ్లగొట్టేసిన ఆ దిక్కులేని ఉప్పర్లను అతడు హృదయపూర్వకంగా ఆదరించాడు. అతని జాతి భగవంతుని వరంచే అమరమయిపోయిందమ్మా. ఇహ అతని జాతిని మనుష్యులు మారణం చెయ్యలేరు.' అని అంది.

జగదంబ లోలోపల కోపగించి ఇలా అంది—'దిక్కులేనివాళ్లయి నంతమాత్రాన వాళ్లు ఉప్పర్లూ వడ్డెర్లూ కదా, బ్రాహ్మలయింట్లో కాపరం పెటతా రటమ్మా? అలా పెట్టచ్చునని శాస్త్రాల్లో ఎక్కడైనా ఉంది టమ్మా!'

'శాస్త్రాలేమి చెపుతయ్యో అది నేను సరిగ్గా ఎరుగనమ్మా. కాని నావ్యథ ఎంతో అది సరిగ్గా నాకు తెలుసు. నాసంగతి ఒకరికి చెప్పకూడేది కాదుగాని ఈవ్యథ నీ వనుభవిస్తే తక్కువకులంవాళ్లనే కారణాన మను ష్యులను రోసినందుకు తగిన శాస్తి దేము దేరూపంగా తప్పక చేస్తాడో అది తెలుసుకుంటావ్. ఇదుగో కులగౌరవ మంటివే అది యెంత పెద్ద పాపమో, ఎంత మోసపు బరువో ఆసంగతి నీవు నిక్కంగా మనసుకు పట్టిం చుకుంటే నీవు నీకూతు ర్నిల్లా బలి వేయలేవ్. జాతీ, కులమూ, ఈ రెండూ సత్యమూనూ; మరి యీయిద్దరూ బ్రతికి ఉన్నంతవరకూ అనుభవింపవలసి యున్న సుఖమూ దుఃఖమూ అంత మిథ్యామాటమ్మా ?'

జగదంబ కలతపడి ఇల్లా అంది—'అషయితే ఈమిథ్యచేతనే జగత్తు నడుస్తూందిటండీ?

సోమమ్మ కొంచెం వాడునవ్వు నవ్వి ఇలా అంది—'జగత్తు నడవడం లేదుకాని నడిచేది అభిశప్తమైన మఃలాటివారి జాతి. నేను పరదేశాలలో ఉన్నాను, వయస్సు చాలా మళ్లింది, చాలా చూచా, చాలా దుఃఖా లను భవించా.—అయితే దేనిని నీవు కులగౌరవమని అనుకుంటున్నావో దాని యాథార్థ్యం నాకు తెలుసు. కాని కథంతా నేను నీకు విపిచెప్పనూలేను, నీకైనా తిన్నగా తెలియకాపోవచ్చు. అయినా ఈ నామాట గుర్తుపెట్టుకో-

మిథ్యకు మర్యాద యిచ్చి యెంత గొప్పదనమైనా దానికి కట్టిపెట్టు; కాని దాంట్లో అంతకష్టమూ అంత మకిలా అంత అనాచారమూ పెరిగిపోతయ్. పెరిగినయ్‌కూడా అవి.

జగదంబ యేమేమో ప్రత్యుత్తరం చెప్పదలుస్తూంది. అంతలో కూతురక్కడికి వచ్చింది. అది చూచి జగదంబ మాటాడకుండా ఊరు కుంది. సంధ్య యింతవరకూ దొడ్లో తాను పాతేసిన పూలమొక్కలకు నీరు పోస్తూంది. చేతిలో బిందె అరుగుమీద పెట్టి యిప్పుడే వంటింట్లోకి వచ్చి నిలబడింది. నిలబడి తల్లికేసిచూచి—'ఇ దేమిటమ్మా? జంతికెలా? అని హఠాత్తుగా నాయనమ్మకేసి తిరిగి—'నాయనమ్మా! అందరూ లడ్లు చేసు కుంటారుగదా! మనయింట్లో అనువాయితీ లే దంటా రెందుకమ్మా? అని అడిగింది.

సోమమ్మ కొంచెం నవ్వి—'ఆసంగతి నాకు తెలీదమ్మా' అని అంది.

'ఆఁ. నీవు మీఅత్తగారిని కనుక్కోలేదుటమ్మా?'

'పుట్టి బుద్ధి యెరిగాక నే నత్తవారిల్లే ఎరగనయితిని. ఇహ ఎవర్లను కనుక్కోను?'

జగదంబ కీసంగతి తెలుసు. ఆమె సిగ్గుపడి తల వంచుకుని తనపని తాను చేసుకోడం మొదలుపెటింది.

సంధ్య యిల్లా అంది—'నాయనమ్మా! ఒకమాట! నీకు సవతులు వందమందా? రెండువందల మందా? మూడువందల మందా? నాలుగు వందల మందా?' ♦

---

♦ కలకత్తా కులీన బ్రాహ్మణుల వృత్తాంతము :

నూరుకన్యలను వక కులీనుడు వివాహం చేసుకొని ఆకన్యలను వారి

నాయనమ్మ నవ్వి యిలా అంది—'సరియైన లెక్క నే నెరుగను గాని నీలెక్కకూడా అసంభవం మాత్రం కాదు. నా కనిమిదో యేట పెళ్లయింది, అప్పటికే మావారికి ఎనభై యారుగురు భార్యలు! నా తరువాత కూడా వారు చాలా పెళ్లిళ్లు చేసుకున్నారుట, కాని ఎన్ని పెళ్లిళ్లు చేసుకున్నారో బహుశా ఆయనకే తెలియదాయిరి, ఇహ నాకెట్లా తెలుస్తుంది?'

'వాళ్ల లెక్క యేమైనా వుందా నాయనమ్మా? ఆ కాతాపుస్తకం లాక్కుని దాచి ఉంచినట్లయితే నాన్నచేత లెక్కకట్టించి ఉందును. వాళ్లందరూ ఇప్పుడెక్కడెక్క డున్నారో తెలిస్తే నాకెందరు పింతండ్రు లున్నారో, ఎందరు పెత్తండ్రు లున్నారో, ఎంద రన్నదమ్ము లున్నారో,

---

వారి పుట్టింటినివదలి నూరారులు యిచ్చినవారియింటిలో వొక్కరాత్రి వశించి మతాంతృలకు బహు యేహ్యంగా ప్రవర్తించి వెనక కొన్ని జాతి నీమాలు ఆచారనీమాలు కలగజేసినారు.

వంశావళీపరంపర వ్రాశేవారు ప్రతితెగకు కొన్ని కుటుంబాలను ఘటికులను యేర్పరచి వుంచినారు. వివాహాలు తటస్థమైనప్పుడు అకలివెలు వ్రాసేవారిని పిలువ నంపించి యోచించి ఆ ఘటికులు సమ్మతించినవెనుక ఫలానా చిన్నదాన్ని యివ్వవలసినదని నిశ్చయం చాయబడుతూ వున్నది. యీ సాంప్రదాయం మనదేశంలో వుండే నందవరీకుల కులాచారానికి సరి పడుతున్నది.

రఘునందనుడు చేసిన వృపస్మృతి యీదేశంలో నిండాగా వాడుకుంటారు. తాంత్రజ్ఞులని పేరుపెట్టుకుని శాస్త్రీయ మతస్థులు కొందరు ప్రబలివున్నారు.

[1830 సంవత్సరంలో ఏనుగుల వీరా స్వామయ్యగారు వ్రాసుకొన్న కాశీయాత్ర అనే దినచర్యనుంచి.]

ఎంత రప్ప చెల్లించుదున్నారో చూసి వస్తే ఎంత బాగుండును!' అని కొంచెం నవ్వేసి—'సరే కాని నాయనమ్మా! మాతాతగారు నూటికో కోటికో వస్తే ఎన్నిరూపాయు లివ్వాలిసొచ్చేది? ఇచ్చి పుచ్చుకోడాలలో మీకూ మీకూ జగడం జరుగుతూ ఉండే దనుకుంటా. ఏం, జరిగేదేనా నాయనమ్మా?' అని అడిగింది.

జగదంబకు కోప మెక్కువచ్చింది. ఇలా అంది—'పిచ్చకళలు కట్టిపెట్టి దేవగృహం గొళ్లెం వేసిరా పో.'

సోమమ్మ తానుగూడా కొంచెం నవ్వేసి—'అన్నీ తెలిసేనా యీ ప్రశ్నలు? ఐనప్పటికీ పిందానుకే వ్యామోహం ఇంకా నీకు తీరలా?' అని అంది.

జగదంబకు మొదటినుంచీ ఈ విరుద్ధపు ఆలోచన లేమీ బాగా లేవు. ఇంతేకాకుండా ఆమెకు లోలోపల విరక్తికూడా తక్కువ కావటం లా. అందువల్ల అత్తగారిమాటకు జవా బిల్లా చెప్పింది,—అనాటిమాటలు నాకు తెలియవుగాని ఈ కాలంలో ఎవళ్లూ అన్ని పెళ్లిళ్లు చేసుకోరు. ఆ అత్యాచారా లన్నీకూడా ఇప్పుడు లేవు. ఎవరో కొంద రేదో కాలంలో ఏమో చేశా రని ఇప్పటివా రెవరయినా కులగౌరవాలు కూలదోసుకుంటారటండీ? నేను బతికేవుంటే ఇది జరగదు.

గృహ యజమానురాలయిన కోడలి కంఠస్వరం కనిపెట్టి అత్త మాటాడ కూరుకుంది. సంధ్య ఇందుకు వగచి నాయనమ్మకు మరికొంచెం దగ్గరసా జరిగి కోమలస్వరంతో ఇల్లా అంది—'అయితే నాయనమ్మా! వాళ్ళటువంటి అత్యాచారా లెందుకు చేసేవాళ్లు? వాళ్లకు మమత్వమయినా ఉండేది కాదటమ్మా?

నాయనమ్మ సంధ్య చేయిచ్చుకుని పక్కకు లాక్కుని—'మమత్వం ఎల్లా ఉంటుం దమ్మా? ఒక్క రాత్రితప్ప బతికున్నంతవరకూ మరి చూడ

దమే పడదో అటువంటివాళ్లకు మమత్వం ఉండడాని కెల్లా వీలు ? ఆ దల్లా ఉండనీ ! ఇపుడు నీకు కానున్న ఏ అత్యాచారం ఉందో అది ఈ అత్యాచారాలకు తీసికట్టా ?" అని అంది.

చేస్తూ చేస్తూన్న పని పారేసి జగదంబ అకస్మాత్తుగా లేచి నిలబడి కూతురిని ఉద్దేశించి—'నీవు దేవగృహంలోకి వెళతావా లేక ఈ పని వొదిలెట్టేసి వెళ్ళి పోయేదే సంధ్యా' అని చాలా కఠోరస్వరంతో అడిగింది.

సంధ్య తల్లి మొహం చూచింది కాని వెళతానని కాని వెళ్లనని కాని యేమీ చెప్పలేదు. ఆమె లేచేటట్టుగాకూడా కనబడలేదు. ఆమె పితామహి నుద్దేశించి మెల్లమెల్లగా ఇల్లా అన్నది—'అయితే ఏవస్తువు కింత గౌరవం, ఇన్నాళ్లనుంచీ ఈరీతిగా వస్తూవుందో దాన్ని నష్టపెట్టుకోవడం మంచిదా ?'

ఈసారి అత్తగారుకూడా కోడలి కఠోరస్వరాన్ని లక్ష్యం చేయక మనుమరాలితో ఇల్లా చెప్పడం మొదలుపెట్టింది—'ఎన్నాళ్లనుండో అను స్యూతంగా వస్తూన్నంత మాత్రంచేత ఏదయినా మంచిది కాదమ్మా తల్లీ, గౌరవంతో వస్తూన్నా మంచిది కాదమ్మా. అది మంచిదా చెడ్డదా అని నడుమ నడుమ తిరగేసి చూచుకుంటూ ఉండవలసి ఉంటుంది. ఇది తర తరాలనుంచీ వస్తూందని మమత్వంతో కళ్లు మూసుకున్నవాళ్లు నశిస్తారు. నా కథంతా ఒకళ్లకు చెప్పుకుందుకు లేదుగాని యిపుడు నీ వెత్తిన విషయ ముండెనే అదే నా జీవనానికి విషమై నన్ను తగులబెట్టేసి పారేస్తూంది' అని చెబుతూ చెబుతూన్న ఆ వృద్ధురాలి కంఠం లోలోపలి యాతనచే క్రమ క్రమంగా బిగుసుకుంటూ వచ్చింది.

పితామహి చెయ్యి తన చేతిలోకి రావించుకొని సంధ్య—'ఈ మాటలన్నీ ఇహ ఇల్లా ఉండనియ్యి వమ్మా' అని అంది.

సోమమ్మ మళ్లీ చేత్తో పాత్రిని వక్షుందగ్గిరికి తీసుకుని నీరవంగా తనను తానే ఒక్క నిమిషంలో కుదటబరుచుకుని సహజకంఠంతో మెల్ల మెల్లగా ఇల్లా చెప్పటం మొదలుపెట్టింది—'సంధ్యా! దేశపురాజు లోక వాడు కేవలం గుణసమష్టిని పురస్కరించుకొనే, కుల మర్యాద ఇచ్చి బ్రాహ్మలను ఒక జాతిగా ఏర్పాటుచేశారు. కొంతకాలం గడిచాక మళ్లా దేశపురాజుల ఆజ్ఞచేతనే ఆ బ్రాహ్మణ వంశవాహకుల దోషాల సంఖ్య ను లెక్కవేసిమాత్రమే జాతిని ఏర్పాటుచేసిన దుర్దినంకూడా వచ్చింది. త్రుటీ అనాచారమూ ఈరెంటి పునాదిమీదా ఏ గౌరవం ప్రతిష్ఠ చేయ బడిందో దాంట్లో ఉన్న మిథ్యను నీవు తెలుసుకున్నట్లయితే ఇప్పుడు మిమ్మల నేది ముగ్ధలను చేసిపెట్టిందో ఆ కులంమాత్రమేకాక, 'తక్కువ కులపువాళ్లు' అని ఏ ఉప్పరి ఆడాళ్ల నిదర్శి మీరు వెళ్లగొట్టిపారేశారో ఆ ఉప్పర్లకులంకూడా తక్కువకులం అని అనడానికి సిగ్గు పుట్టి మీతలలు నేలకు వాలతయ్.

క్రోధంచేతా విరక్తిచేతా జగదంబ మరి నిలువలేక అక్కణ్ణించి లేచి వెళిపోయింది గాని సంధ్య మెదలకుండా అక్కణ్ణే కూర్చునివుంది. లజ్జా దుఃఖాలతో కలిసిన ఒకానొకసంగతేదో తన వృద్ధ పితామహి మనస్సులో ఉన్నదనిన్నీ దానిచేత ఆమెహృదయం దగ్ధమైపోతున్నదనిన్నీ సంధ్య ఊహించుకుంది. తన తాతకు అనేక వివాహాలు కాబట్టి వాట్లలో ఈ దుఃఖానికేదో గట్టిసంబంధం ఉంటుందని హఠాత్తుగా ఆమెకు తట్టింది.

కొంచెం సేపు పిల్లా నిశ్శబ్దంగా కూచుని సిగ్గుతో మెల్లమెల్లగా ఇల్లా అడిగింది—'నాయనమ్మా నిజంగా మనలో చాలా పెద్ద అనాచారం ప్రవేశించిందమ్మా? దేన్ని చూచుకుని మేముకులుకుతున్నామో దాంట్లో ఇంతే మోసమూ ఇంతలోపమూ ఉందిటమ్మా?'

'దాంట్లో ఎంత లోప ముందో నాకంటె ఎక్కువగా తెలిసిన వారులేరు.' అని యిల్లా చెప్పటానిక్కూడా అంతరాయంగా ఆమె కళ్ళల్లో నీళ్లు నిండేయ్. ఈ నిండడం ఈ సంధ్యా కాలాంధకారంలో కూడా సంధ్యకు తెలియకుండా పోలా. సోమమ్మ రెండుకళ్లూ చేత్తో తుడుచుకుని మెల్లమెల్లగా మళ్ళా ఇల్లా ఆరంభించింది—'అయితే నడుమ నడుమ నే నేమనుకుంటానో తెలుసా సంధ్యా? మనుషులకూ మనుషులకూ నడుమ మనుషు డేర్పరచిన ఈ సరిహద్దులు ఎన్నటికీ భగవంతుడు కల్పించిన నియమమైవుండవ్. ఆయనదగ్గిరికి పోవటానికి బాహాటంగా తెరచిన సింహ ద్వారంలో మనుష్యులు కంపమీద ఎంత కంపకొట్టినా ఆ అత్యాచారపు కంప అంతకన్న చాటుగా అనాచారాలతో శతచ్ఛిత్ర మవుతుంది. వాట్ల నడుమగుండా పాపమూ చెత్తా చెదారమూ మాత్రమే తెలియకుండా ప్రవేశిస్తయ్.

కొంచెంసేపు వా రిద్దరూ మాటాడ కూర్చున్నారు. ఆమె మాటలతో తన తాత పెళ్లిళ్ళకేదో నింద్యమయిన సంబంధం ఉన్నదని సంధ్యకు మనస్సులో గట్టిపడడం మొదలు పెట్టింది. దాని తలా తోకా తెలియకున్నా సంధ్య కది భయజనక మయింది.

'అమ్మాయీ! వెళ్లి దేవగృహంలో ఆ పనేదో చూస్కో; లేకపోతే మీ అమ్మకు చాలా కోపం వొస్తుంది' అని సోమమ్మ అన్నది.

'ఈపాటి కా విడే చేసుకుని ఉంటుంది' అని అంటూనే సంధ్య సోమమ్మ చెయ్యిచ్చుకుని 'నాయనమ్మా! నా గదిలోకి పోదాం పా, ఆనాటి అచ్చటలూ ముచ్చటలూ కొంచెం చెప్పుకుందాం' అని చేయిచ్చుకుని ఒక రకపు బలవంత బ్రాహ్మణార్థంగా తన గదిలోకి తీసుకుపోయింది.



రాత్రెంతో పొద్దు పోలేదు, బహుశా జాముపొద్దు పోయుండచ్చు. చలికాలంలో పల్లెటూళ్లల్లో ఆమాత్రం పొద్దోయినా ఎంతో గంభీరంగా ఉన్నట్లుంటుంది. మీనాక్షి గదిలో ఒకమూల ఆముదపుదీపం మినుకు మినుకుమంటూ ఉంది. గదినడుమ మీనాక్షీని ఆమెకు దాపుగా పేరమ్మాను కూచుని వున్నారు. చేతులూ మొహమూ తిప్పుతూ పేరమ్మ—'ఇదిగో మీనాక్షీ నామాట విను! వెర్రికళలు చేయకు. మందిచ్చిపోయాడు—మింగేసి పారేయ్. మళ్లా మామూలుమనిషి వైపోతావ్. ఎవ్వరూ కనిపెట్ట మాగూడా కనిపెట్టలేరు.

కన్నీళ్లు కారుతూవుండడంవల్ల మీనాక్షిమాటలు నడుమ నడుమ ఆగుతూన్నయ్, ఇల్లా అంది—'నాకు మీ రిటువంటిమాట లెల్లా చెప్పగల గండీ? జరిగిన పాపం జరిగిపోంగా దానిమీద మరో పాపానికెట్లా ఒడి గట్టుకోనండీ? నరకంలోగూడా నాకు జాగా ఉండేటట్లు కనబడం లేదే!'

పేరమ్మ ఇల్లా కసున్న మన్నది—'ఇంత దొడ్డకులానికి మసి పూసే నీ విహ స్వర్గాని కెక్క దలచుకున్నావ్ కాబోలునేం? సరే కాని తిన్నగా ఆలోచించుకో. అతి చేసి దేశానికల్లా పూజ్యులైన మా శాస్త్రుల్లు తమ్ముడు తల తీసెయ్యకు.'

మీనాక్షి చేతులు జోడించి యేడుస్తూ ఇల్లా అన్నది,—'నే నా మందు కొంచెమైనా మింగను. మీరు నాకు విషంపెట్టి చంపెయ్య దలచుకున్నారు. నాకు తెలిసిపోయింది.'

మొహం అతివికారంగా పెట్టి పేరమ్మ ఇల్లా అంది—'అల్లా చెప్పు! చస్తానని భయంచేత ఆ మందు మింగనని చెప్పక 'శిశుహత్య చేయరాదు, భ్రూణహత్య చేయరాదు' అని ధర్మపన్నాలేకరువుపెట్టడం ఎందుకు? 'నాకు చస్తానని భయం' అని అక్షరాలా చెప్పేసెయ్.'

మీనాక్షి ఇల్లా అంది—'కాని అది విషం.'

పేరమ్మ—'అది విషమైతేనీకేం? నీవు మరి ఛావవులే!' అని తీక్ష్ణంగా అంటూనే ఒక్క రెప్పపాటులో కంఠస్వరం కోమలంగానూ, సదయంగానూ మార్చి—'వైరిదంటే వేరే యెవరో చెప్పు! నీకు మేం చెడుమందు పెడతామంటే ఆలోచించు. ఇదెల్లాగయినా సంభవమేనా? పేరమ్మ ఇల్లా చేస్తుం దని ఎవరైనా అంటారా? ఎబ్బే! నోరికి. బ్రహ్మ రాతవల్ల నీకడుపున బడ్డ శత్రువు కరిగిపోనీ! ఇదెంతట్లోకి? ఈ కాసంతా తీరిపోగానే మళ్లా యెప్పట్లా అయిపోతావ్. అటుపైని తిను, తిరుగు, తీర్థాలు, పురాణాలు, వారాలు, వ్రతాలు ని యిష్టమే యిష్టం!—అపై మాట లెవళ్ళకు తెలుస్తయ్? ఎవళ్ళు చూడవస్తారు? అని అంది.

మీనాక్షి మొహం మెత్తక ఒక యేడ్పేడ్చేసి ఇలా అంది—ఏమైనా సరే, నే నా మందు అంటను ముట్టను,—ఆ మందు తింటే నే నెన్నటికీ బతకను.'

పేరమ్మ భయపడేటట్లు కోపగించి—'ఛీ ఈసృష్టిలో నీలాటి దెక్కడా లేదు. ఈమందు తినకుంటే వెంటనే ఈయింట్లోంచి లేచిపో. ఎంతచెడ్డా మగవాడుకదా! అత నేదో చిన్నపని చేయనే చేశాడనుకో! అట్లా అని ఆడాళ్లింత పట్టు పటతారా? పట్టుపట్టి నెగ్గుతారా? శాస్తుల్లు, పాపం ఏం చెప్పాడో కొంచెం విన్నావా—'సరే అయిందేమో అయిపోయింది, దానికి యాభైరూపాయ లిస్తా, కాశీగాని బృందావనం గాని లేచిపొమ్మను' అని చెప్పాడు. ఇహ ఆయన తప్పేముంది? రూపాయ లేమైనా కాసినా కూసినా? ఒక్కసారిగా ఓగుప్పెడు.' అని అంది.

మీనాక్షి ఇలా అంది—'నాకు రూపాయ లెందుకండీ? రూపాయ లతో నే నేం చేసుకోను? నే నెవరిమొహమూ ఎరుగను. నే నెక్కడికి పోనండీ? నే నెక్కడికెళ్లి ఈ మొహం చూపించుకుని నిలబడగలనండీ'?

పేరమ్మ ఇల్లా అంది—'నీవు మమ్మల్నిలాగంగదీసి నీఇష్టం వచ్చినట్లు ఆడించటానికి చేసే ఉపాయంకాదా యిది మీనాక్షీ? కాశీ అనినీ బృందావన మనినీ లోకులు మాటి మాటికీ చెప్పుకుంటూ ఉంటారు. వెళుతూ ఉంటారు. ఇంతమంది కచ్చట చోటుంటే నీకు లేకుండా పోయిందా?'

మీనాక్షి కొన్ని నిమిషాలు నిశ్శబ్దంగా ఉండి ఇలా అంది— 'పేరమ్మగారూ! నాకిదంతా తెలుసు. తాండవశాస్త్రిగారు సత్యనారాయణావధాన్లగారి పిల్లకు రేపు పుస్తె కడతారనీ తెలుసు. కాబట్టి విషం తిని చావనీ, లేక కాశికి లేచిపోనీ, మరేమయినా కానీ, ఈ యింట్లో మరి మీనాక్షి లేకుండాపోవాలి. ఇదీ మీ కోరిక. కాని ఓదేముడా!—' అని చెబుతుండగా మీనాక్షికి పట్టరాని దుఃఖం వచ్చింది. ఆమె యేడ్చి చేతు లెత్తి దణ్ణం పెట్టి మళ్ళా అందుకుంది—'ఓదేముడా! నీపాదాలముం దింత మందికి చోటుండగా నాకెందు కుండదు? బాల్యంనుంచీ పాపం అంటే యేమిటో ఎరగను. అయినా నాకు పాపం చేయవలసిన అవసరం కూడా కలగలేదనుకుంటాను,—నీ కిదంతా తెలుసు. ఉపాయం ఎరగని దాన్నిగనుకా దిక్కుదివాసీ లేనిదాన్నిగనుకా ఈ పాపపు బండిని నే నొక్కత్తెనే లాక్కుపోవాలా?'

దేముడిపై రత్తడంచేత పేరమ్మ కక్కుడలేని కోపమూ వచ్చి ఇల్లా అన్నది—'ఆఁ. చావు! శాపనార్థాలు పెటతావా యేమిటి? పాపం నీవు పాలు తాగే పిల్లవు కాబోను. అదుపులో ఉండబట్టిగాని లేకపోతే ఈపాటికి ఎంతమందిని మింగేదానివో! నీ వపలు లేపి పెట్టకపోతే మగవాడు నీమీద చేయి చేసుకుంటాడా యేమిటి? అయినా మగవాడికి తప్పేమిటి? ఇటువంటిదానివు ఏనాటి [illegible] ఉన్నాడేమో చెప్పా పేరమ్మకు?

ఇంకా దీనికి చెప్పద మేమిటి? మీనాక్షి పైటకొంగుతో కళ్లొత్తుకోవడం ఆరంభించింది. పేరమ్మ వెనకటికంటె స్వరం కొంచెం తగ్గించి ఇల్లా అంది—'అమ్మాయీ మీనాక్షీ! ఇదిగో ఆ కోయదాని మందు పుచ్చుకోవడం నీకు భయమయితే కాంతారావుమందంటే నమ్మకమేనా? పోనీ, అతడువేసే మాత్రయినా ఒకటి—'

మీనాక్షి నిర్వేదపడి—'కాంతారావుగారటువంటి మందు లిస్తారా?' అని అన్నది.

'ఇవ్వడా? కాసులుతమ్మ డివ్వమన్నా ఇవ్వ కున్నుంటాడా? ఎంతమాటా? ఫరవా లే దిస్తాడు లే. కబురు వెళ్లింది; 'ఇదిగో వచ్చె' అని సమాధానంకూడా వచ్చింది. ఆయన వచ్చినప్పు డన్ని సంగతులూ చెప్పేయడం మంచి దని నీకు ముందస్తిగా చెప్పిపెడుతున్నా' అని పేరమ్మ అన్నది.

మీనాక్షి మరిమాటాడక కళ్లప్పగించి కూచుంది. పేరమ్మ ఉత్సాహం కలిగించే మాటలు కొన్ని అల్లబోయేటంతట్లో దవ్వునా దాపునా బూట్సుల చప్పుడు వినబడ్డది. దానితోపాటు కాంతారావు మాటలు కూడా ఇల్లా వినబడ్డయ్—'ఈ దారంతా కీకారణ్యంగా ఉందే. ఇక్కడ ఒక దీపమైనా లేదేం? నవుకరులందరూ నిద్రపోయారు!'

ఈలా అంటూఅంటూ కాంతారావు గబగబా ఇంట్లోకి వచ్చి, చంకలో ఇరికించుకున్న అయిదారు చిన్నాపెద్దా గ్రంథాలను మేజాబల్ల మీద పెట్టి, చేతిలోని మందులపెట్టెను భూస్థాపితంచేస్తూ—'ఇవ్వాళ ఎల్లా ఉన్నదమ్మా మీనాక్షీ? ఉఁ హుఁ. హుఁ. హూఁ. అనుకుంటూ మూలుక్కుంటూ కూచుంటే ఎల్లా? చలిగాలి తోలుతూందికదా; జలు బట్టుకుంటే? రెమిడీ అంటే—మందు, మార్చాలిసి ఉందనుక్కుంటూను. ఇదేమిటి! పేరమ్మ పిన్నా? వచ్చి ఎంతసే పయింది? అందరూ తిన్నగా ఉన్నారా? దార్లో వస్తూవస్తూ నిన్న మీమనమరాలిని చూశా. అంత

ఆరోగ్యంగా ఉన్నట్టు కనబడలేదు. ఐతే ఆకలి యెల్లా ఉంటూందో ? రేపొద్దున ఒకసారి తీసుకొచ్చి చూపించు. నాఇంక ఎల్లావుందో చూడాలి. నే ఏరోజున ఏదిక్కుకు పోనో ఏదిక్కున నా చూపు పడదో ఆపళంగా అక్కడ ఏదో విడ్డూరమూ ఇంతా పుట్టుకురావడమే. నాకు చావడానికైనా తీరిక లేకండా ఉంది. ఇది ఇల్లా ఉండంగా రేపు మా అమ్మాయి వివాహం. పిన్నీ ! ఎవరిని చూచినా రేపు చీకటితోనే చూడాలి. పిల్లదాని పెళ్లి కాదూ ! బయటికి రావడానికి ఇహా తీరుబా టుండదు. ఐతే ఈ రోగుల గతి యేమా' అని విచారిస్తున్నా. ఒకళ్లా ఇద్దరా ? కాంతారావునుతప్పితే విస్సన్న నిప్పు డెవళ్ళూ పిలవడం లేదు. ఈలాటి పిచ్చి పెట్టుకూర్చుంటే నెట్టడం కష్టం. పాపం, అతనుమాత్రం కొంచెం నేర్చుకో లేదా యేమిటి ? అతగాణ్ణి ఇప్పుడుచూస్తే జాలి వేస్తూంది. సరేఏదమ్మా ఏదీ ఒకసారి చేయి. గంగయ్యకు గుండెనంజట !,—ఒకసారి చూచి రావాలి. ఏదమ్మా చే యేది ఒకసారి.

మీనాక్షి చేయి ఈయక తల వాల్చుకుని మెదలకుండా కూచుంది.

'దీని జబ్బేమిటో సర్గా కనిపెట్టారా కాంతారావుగారూ ? అని పేరమ్మ అడిగింది.

కాంతారావు ఆమె మొహం చూచి,—డిస్—అజీర్ణం, దోషం, పైత్యం' అని అన్నాడు.

అతను ఇల్లా అంటుండంగా తనను ప్రశ్నించిన పేరమ్మ తల తిప్పడం మొదలు పెట్టింది అది అతడు చూచాడు. తన వైద్యవిద్య అంతా అంతటితో అంతరించిపోయేట్టు అతనికి తోచింది. అతడు తొట్రుపడి,— 'కాదా యేమిటి ? ఎందుక్కాదూ ? విస్సన్న వచ్చాడా యేమిటి? వాడేమిటని చెప్పాడు ? ఏమి మం దిచ్చిపోయాడు ? ఆ మం దేదీ ?' అని అన్నాడు.

పేరమ్మ మొహంలో సత్యాసత్యాలూ యుక్తాయుక్తతలూ కాఠిన్యకోమలత్వాలూ మొదలగు ద్వంద్వాలు పరస్పర విరోధం లేకుండా కాపరం చేస్తయ్. ఏదో ఒక ఉపోద్ఘాతం మొదలేసి దాంతో అసలు సంగతికి మెరుగుదోమటం ఆమెకు దైవమిచ్చిన వరం. అట్టి ప్రజ్ఞగల పేరమ్మకూడా ప్రకృతం కొంచెం వెనకముందులు చూచుకోవలసివచ్చింది.

ఆవిడ తల తిప్పి— ‚లేదు నాయనా లేదు' విస్సన్నకూ కబురెట్టలేదు, ప్రాణాచార్లకూ కబురెట్టలేదు. నీ ముందు వాళ్ళెంత? వాళ్ళకసలు వైద్యమనే మాట తెలుసా అని? ఈలాగనే తాండవకృష్ణుల్తో అంధరిముందరా అంటూ ఉంటాడు.

‚అనడా మరి? అంధరూ అంటారు. విస్సన్న ఇంకా నావద్ద ఫదేళ్లు చదువుకోవాలి. ఆనాడు పల్ సెటిలా యిచ్చి

ఔనౌను. విన్నావా బాబూ! ఈముండాకూతురుగూడా నిన్ను తప్పితే ఇంకోణ్ని పిలవడానికి వీలు లేని పని చేసుకున్నుంది.'

‚నే నుండంగా ఇంకో డీ యింట్లో వైద్యం చేయడానికి కాలు పెట్టగలడా? కాని పిన్నీ—ఈరోగాలు కుదరటానికి కొంత టైమ్—ఆలస్యం అవుతుంది. అయితే ఏమాట, కామాటే. నేను రెండు మూడు రెమిడీలు—మందులకంటె ఎక్కువ మందులు వాడను. ఆరెండు నెంబర్ల మందులతో నోరు నీ రూరడం కట్టిందా లేదా చెప్పమ్మ మీనాక్షీ! నిజంగా చెప్పు.'

‚వాలిన తల నేలతో కలిసిపోతే బతికిపోయేదాన్నికదా' అని మీనాక్షి అనుకుంది. మీనాక్షికి బదులు పేరమ్మ ఇల్లా చెప్పడం ఆరంభించింది—‚మీనాక్షికి నీమీదతప్ప ఇంకోరిమీద నమ్మకం లేదు నాయనా! నీవే దానికి ధన్వంతరి! నీమందే అమృతం. కాని కాంతారావూ! దీన్నిజబ్బు నీ వనుకొన్నదిమాత్రం కాదు. అదృష్టం ఫిరాయించింది. నీ

వనుకొన్నదానికి సర్గా విరుద్ధం. పట్టి దురదృష్టవంతురాలం! పాడు మొహం!'

కాంతారావు చే యెత్తి — 'విరుద్ధం కాదమ్మా పిన్నీ. విరుద్ధ మెన్నటికీ కాదు. విస్సన్న చేతిలో పడితే విషమించేదే కాని ఇతడు మరెవరూ కాదు — కాంతారావు టుమీ ' అని అన్నాడు.

పేరమ్మ మొహం మొత్తుకుని— 'నీవు బతికి స్తే భయం లేని మాట నిజమే కాని ఈ ముండకూతురు అందరినెత్తినీ మీదా చేతులు పెట్టి కూచుంది. ఇప్పుడు నీ వాలోచించి దీనికి తగినమందు వేయకపోతే ఈ యింటికీ ఈ కులానికీ మొల అంటుకొనే గతి పట్టింది నాయనా!' అని అంది.

పేరమ్మ ఈ తుదిమాట లీ మహావైద్యున కర్థం కాలేదు. పేరమ్మ కాంతారావు మొహం చూచి అతని కేమాత్రమూ అర్థం కాలేదని గ్రహించింది. కాబట్టి ఈసంగతి తేటతెల్లంగా తెలపడానికతన్ని ఇంకో గదిలోకి తీసుకొపోయింది. పేరమ్మ అక్కడ అతనిచెవిలో కొన్నిమాట లస్పష్టంగా చెప్పంగానే కాంతారావు— 'ఏ మంటున్నావమ్మా, మీనాక్షా? మీనాక్షా?—'

'నేనేమి చెప్పను నాయనా? నొష్టను రాసిన రాత నెవరు తుడిచి పారెయ్యగలరు చెప్పు? నిగారుగా ఉన్న తాండవశాస్తుల్లు తల నేలమీదికి వాలకుండా ఉండేటట్టు ఏదో ఒక మందియ్యి నాయనా! ఈయన ఈ దేశానికల్లా తల. బ్రాహ్మణసంఘానికి శిరోమణి,—ఇతని తప్పే ముంది బాబూ? ఇది, 'ఈ మీనాక్షి' 'ఇతనియింట్లో ప్రవేశించి యేమి చేసిపెట్టిందో చూడు తండ్రీ!'

కాంతారావు మొహం వెలవెల పోయింది. అతడు మీనాక్షి మొహం ఒకసారి చూడడానికి ప్రయత్నించాడు. అటుతరువాత మెల్ల మెల్లగా —'పిన్నీ! మీరు విస్సన్నకే పిలిపించటం మంచిది. దీనికి తగిన

మందులు నా దగ్గర లేవు.' అని మందులపెట్టెనూ పుస్తకాలనూ తీసుకోవడానికి వంగాడు.

పేరమ్మ విస్తుపోయి—'ఏమన్నావ్ కాంతయ్యా ఇది పదుగురికీ తెలియవచ్చా? ఎంతచెడ్డా నీవు మనవాడవ్. విస్సన్న పరాయివాడు,—పైగా శూద్రుడు!;—బ్రాహ్మల మాన మర్యాద లతనికి తెలపచ్చా?' అని అంది. కాని విస్సన్నకు తెలపకముందే హాఠాత్తుగా తలుపు తోసుకుని తాండవశాస్త్రి లోపలికి వచ్చాడు. అతడు కాంతారావు చేయుచ్చుగుని—'ఇదిగో ఇది విష మని భయపడి ఎవరి మందూ తినడం లేదు. లేకపోతే నీకీ కష్టం కలిగించేవాణ్ణి కాదు. ఈ యాపత్తు నీవే దాటేయించాలి కాంతారావూ!' అని అన్నాడు.

కాంతారావు, చేయి లాక్కుని—'ఎబ్బె, ఈ చాటు మాటు పనులు నావి కావు. నేను రోగులను చూస్తా, రెమిడీ సెలెక్ట్ చేస్తా, అంతే, బస్. ఇహ మీరు పోయి విస్సన్ననూ గిస్సన్ననూ భోగట్టా చేయండి. అతనికయినా తెలుసునో తెలియదో.' అని పుస్తకాలు చంకలో ఇరికించుకోడానికి ప్రయత్నించాడు.

తాండవశాస్త్రి మళ్లా ఒకసారి అతని చేయుచ్చుగుని ఇంచుమించుగా ఏడుపుస్వరంపెట్టి—'బాబూ కాంతారావూ! ఈ ముసలివాణ్ణి కొంచెం ఒడ్డెక్కించు. బంధుత్వం విచారిస్తే నేను నీకు బాబువరస. నీ వీమాట బుజాన వేసుకుని తిరుగుతా వని తెలిస్తే నిన్నిచటికి పిలిపించనే పిలిపించను. నీకు విన్నపం చేస్తున్నా బాబూ! నీ చేతులు పట్టుకుంటా. ఇవి చేతులు కావు; మరి కాళ్ళనుకో నాయనా. మా కేదో దారి చూపి మరి పో నాయనా' అని అన్నాడు.

కాంతారావు మళ్లా చేయి లాక్కుని—'ఏమండి బాబయ్యా? మనకూ మనకూ దగ్గరచుట్టరికం ఉందని నేను జీవహత్య కొడిగట్టనుటండీ?

భేష్ భేష్! మీరు భలేవారు. పరలోకంలో నన్నే మని దీనికి సమాధానం చెప్పుకోమంటారు?' అని అన్నాడు.

అటుతరువాత తాండవశాస్త్రి కాంతారావును విడిచిపెట్టి గడప దగ్గిరికి వెళ్లాడు. అతని ముఖకవళికా కంటి తీరూ కంఠస్వరమూ ఏదో విచిత్రమయిన ఇంద్రజాలంచే ఒక్క నిమిషంలో మారిపోయినయ్. అతడప్పుడు కర్కశస్వరంతో ఇల్లా అన్నాడు—'ఇంత పొద్దు పోయినతర్వాత పెద్దమనుష్యులయింట్లో ని వ్వెందుకు దూరావ్? ఇక్కడ నీ కేం పని వుంది?'

ఈ ప్రశ్న వినంగానే కాంతారావు కాశ్చర్యం కలిగింది. ఇంచుమించుగా అతినికి మతోయింది. అతడిల్లా అన్నాడు—'ఏం పనా? చికిత్స! చికిత్స చేయించుకోడానికని నాకోసం కబురు పంపిన వా రెవరు? పహావ్వా!'

తాండవశాస్త్రి ఎగిరిపడి 'వహావ్వా? వెధవ వహావ్వా! పంచదానమాత్ర లోకటి వేసుకుని నీవూ వైద్య మెరుగుదువేం? చికిత్సట చికిత్స! విధి అంటే ఏమిటో నిషేధ మంటే యేమిటో తెలియని దురాచారపు ముండాకొడకా! నిన్నెవ్వ రాహ్వానించారు? ఏ దారిని ఈ యింట్లో దూరావ్? గడికంత నీ కెవరు తెరచారు?' అని అంటూ మీనాక్షి ఉన్న గదికేసి తిరిగి—'పంచ మహాపాతకురాలా! మూడు కాళ్ల ముసలే, కళ్లులేని కబోదే, పశువంటి మీ మామగారు వచ్చి యేడిచి యేడిచి పాయె; 'నేను రానుపో' అని అంటివాయె. ముసిలి అత్తగా రొకమూల చస్తూంటే,—నేను స్వయంగా వచ్చి, 'మీనాక్షి! వెళ్లు' అని చెప్పినా కదిలావూ మొద్దల్లే? ఎందుకూ? ఇందుకేనా? రాత్రి రెండు ఝాములప్పుడు చికిత్స చేయించుకోవడానికేనా? అగు భాండాలపు ముండా! రేపు నీతల గొరిగించి సున్నపుబొట్లు పెట్టించి ఊరేగించి మరి

పంపకపోతే నాపేరు తాండవశాస్త్రి కాదు.' అని అన్నాడు.

మను గెప్పై దూడి కింద పడిపోయిందో మీనాక్షికి తెలియదు. ఆమెనోట మాటలేదు. కేవలం కళ్లు పెట్టుకుని చూస్తూ కూచుంది— రాతిబొమ్మ!

తాండవశాస్త్రి పేరమ్మకేసి తిరిగి—'పేరమ్మా! నీవు వీళ్లనీ వీళ్ల వ్యవహారాన్నీ చూశావుకదా! నేను పది ఊళ్లకు సభాపతిని. అటువంటి నాయింట్లోనేనా యీ మహాపాతకం! పెద్దపులిగుహాలో, ♦ తోడేళ్ల కాపరం అయిపోయిందే!' అని అన్నాడు.

పేరమ్మ గడబిడపడి యింతవరకూ నోరెత్తకుండా చూస్తూచూస్తూ కూచుంది. ఇప్పుడు తెలివి తెచ్చుకుని—'ఔనౌను. సరిగ్గా ఇప్పుడు నీ వన్నట్టే అయింది.' అని అంది.

'నీ విందుకు సాక్షివిటుమీ.'

'కాకేం? రాత్రివేళ చేతి కింద తీరిక అయిందికదా— మీనాక్షి ఎల్లావుందో చూచిపోదా మని వచ్చా. వచ్చి చూస్తునుకదా—,ఒకరిచెవిలో ఒకరు, ఒకరిమీద ఒకరు! ఏమి రహస్యాలు? ఏమి సరసాలు? ఏమి నవ్వులు? ఏమి వింతలు? వహవా!'

మీనాక్షి యిందుక్కూడా నోరేమి కదిలింపలేదు. ఆమె వెనుకటిమాదిరిగానే రాతిబొమ్మ!

---

♦ పెద్దపులులగుహాలలో తోడేళ్ళు చాటుగానివసించి వాటి పిల్లలను తింటూఉంటవి. ఈరీతిగా తోడేళ్ళు రుచిపడి పెద్దపులులు తమను హింసించినా తప్పించుకొని ఎల్లాగో వాటి గుహలలోనే చాటుగా నివసిస్తూ ఉంటవి.

కాంతారావు దయ్యం పట్టినవాని చందంగా నిలబడి వున్నాడు. తాండవశాస్త్రి అతన్ని ఒక తోపు తోసి చంకలోంచి పుస్తకాలు లాగి పారేసి ఒక అర్ధచంద్రప్రయోగం చేసి—'వెధవ, కుంక, భడవె, ఫో లేచి పో మాయింట్లోంచి. నీవు మా రామావధాన్లగారి అల్లుడ వయిపోయావని ఊరుకున్నానుగాని లేకుంటే జూతీ తీసి ఎడాపెడా కొట్టి కొనప్రాణంతో బయటికీడ్చి పోలీసు పేశన్కు పంపించి ఉండేవాణ్ని' అని ఒక్కతాపు తన్నాడు. ఇంతలో నవుకర్లూచాకర్లూ మూగారు. రెండుపక్కలా నిలవబడి ఉన్న నవుకర్ల నడుమగా తాండవశాస్త్రి కాంతారావును తోస్తూ తన్నుతూ తిటుతూ బయటికి తరుముకుపోయాడు.

'వా, భేష్, మజా, భలే, సరిసరి, అబ్బా, అమ్మా, అయ్యో, మొర్రో' మనుకుంటూ కిందపడ్డ పుస్తకాలు తీసుకుంటూ కాంతారావు తాండవశాస్త్రి ముందుముందు తూలుతూ లేస్తూ పరుగెత్తాడు.

నవుకర్లు కూడాకూడా వెళ్లారు. పేరమ్మకూడా మాటాడకుండా వాళ్ల వెనకాలే వెళ్ళి వెళ్ళి, వాళ్లు వెళ్లిన జాడ తెలియక దారి పక్క నిల బడిపోయింది.

ఉన్న దొక్క మీనాక్షి. వెనుకటివలెనే కదలకుండా మెదలకుండా మాటాడకుండా ప్రాణంలేని రాతిబొమ్మల్లే అక్కడ ఉన్న దొక్క మీనాక్షి !

## ౧౨

పొద్దుటినుంచీ ఊరంతా సన్నాయిమేళాలతో గింగురుమంటూ వుంది. మాఘం తొందరగా రాబోతూవుందనే భయంచేత లగ్గాలన్నీ పేడే అయిపోతూ ఉన్నయ్. ఊళ్లో నాలుగయి దిళ్లల్లో పెళ్లిళ్లు. ఆ పెళ్లిం డ్లలో సంధ్య పెండ్లికూడా ఒకటి.

తానీ వూళ్లోంచి వెళ్లిపోవాలనే సంకల్పాన్ని వఝులింతవరకూ కార్యంలోకి పరిణమింపజేయలేదు. దానికనేక కారణా లున్నాయ్. అత డెప్పటిలాగానే పనిపాటలు చేసికోవడం మొదలుపెట్టాడు. అతనిలో మార్పేమీ పయికి కనబడటం లేదు గాని కొంచెం జాగ్రత్తగా పరిశీలిస్తే స్వదేశంలో మమత్వం తప్పిపోయిందనిమాత్రం కనుక్కోవచ్చు. అత డిదివరకు దేశానికి మేలు కలిగించే పనులు కొన్ని తలపెట్టి చాలా శ్రద్ధతో చేస్తూనూ చేయిస్తూనూ వస్తున్నాడు. ఇప్పుడా పను లన్నీ మానుకున్నాడు. అతనికి వెలి. ఊళ్లో ఎవళ్లూ అతన్ని తాంబూలానికిగాని భోజనానికిగాని పిలవలేదు. ఇతరులను పతితులనుగా చేయకుండా ఉండటానికిగాను అత డీనా డెక్కడికీ పదచలనం చేయలేదు. అతని కీనా డన్ని తలుపులూ 'బంద్.'

సూర్యు డస్తమించాడు. వఝులు తన మేడమీది చదువులగదిలో మాటాడకుండా కూచున్నాడు. చలిగాలి తోలుతూంది. కాని మేడమీద తలుపులూ కిటికీలూ తెరిచేవున్నయ్. అంచేత ఇల్లూ మేడా గాలితో రుంయ్ రుంయ్ మంటున్నయ్. మింట మబ్బు లేదు. త్రయోదశీచంద్రుని కాంతు లేమూలనుంచి ఆమూలకు వ్యాపించెయ్. వఝులు కిటికీముందు కూచున్నాడు. అతని కాళ్లముందు చంద్ర కిరణాలు కొన్ని పడుతున్నయ్. అతని కెదురుగా కొబ్బరిచెట్ల ఆకులమీద కొన్ని చంద్రకిరణాలు పడి నిగ నిగ లాడుతున్నయ్. సగము మెలకువలోనూ సగము నిద్రలోనూ ఉన్న వఝులు ఆ నిగనిగలు చూచి ఏమి తలపోస్తున్నాడో ఎవరికీ తెలియదు. వంటవాడు వచ్చి—'వంటయింది' అని చెప్పాడు. 'నాకిప్పు డాకలిగా లే'దని చెప్పి వఝులు వంటవాణ్ణి పంపించేశాడు. దీపమూ ధూపమూ లేని ఆగది ఎదటిగోడమీద వున్న గడియారం పదకొండుగంటలు కొట్టి నిద్రాసమయాన్ని హోరపెట్టుకున్నా వఝులుమాత్రం కదలటానికి కిచ్ఛయింపలేదు. ఎల్లావున్న వఝులు అల్లాగే వున్నాడు.

తలుపురెక్కమీద చేతి చప్పుడూ పైమెట్టుమీద కాలిచప్పుడూ అతనికి హఠాత్తుగా వినబడ్డయ్. 'ఎవరువారు?' అని అత డొకమాఱు రదుగ దలచుకున్నాడు. పల్లెటూళ్లల్లో అంత పొద్దుపోయిన్న వేళల్లో ఎవరూ వచ్చేవాడుక ఉండదు. అతని కీరోజున ఇచ్ఛ అనేది చచ్చిపోయింది. కాబట్టి అత డేమీ ప్రశ్నింపలేదు.

ప్రశ్నకుగాని ఆలోచనకుగాని అట్టే సమయం అక్కరలేకపోయింది. రెండుమూడు నిమిషాలలోనే ద్వారప్రాంతంలో కొత్త ఉప్పాడచీర కస కసమని చప్పుడు చేయడమూ వెనువెంటనే తుపానుమల్లే ఎవరో రావడమూ వరుధుల పాదాలముందు కుప్పన కూలబడడమూ సంభవించింది.

వరుధులు బెదురుతూ బెదురుతూ లేచి నిలబడ్డాడు. అతని మునిముందు ఒక తెల్లని చీర, వెన్నెలలో నిగనిగలాడుతూంది. తనముందు పడియున్న మని షెవరో ఒక్కచూపుతో అతడు తెలుసుకున్నాడు. అతని హృదయం ఇప్పుడు భయంచేతా ఆశ్చర్యంచేతా నిండిపోయింది. తా నప్పు డేమనాలో ఏమిచేయాలో అతని కేమీ తోచలేదు.

కాని అందుక్కూడా అవకాశం లేకండాపోయింది. భయంకరమూ మర్మాంతికమూ అపరుద్ధమూ అయిన ఒకానొక ఆక్రందనం, అకస్మాత్తుగా అయింటిగాలినీ చీకటినీ ఇంటినున్న సమస్తాన్నీ భేదించి దడదడ లాడించింది.

వరుధులు రెండుమూడు నిమిషాలవరకూ మాటాడలేకపోయాడు. పిమ్మట కొంచెం అనింటూ నిలబడి—'ఏమిటది సంధ్యా? ఏమిటి విశేషం?' అని ప్రశ్నించాడు.

సంధ్య మొహం మెత్తి చూచింది. చీరతోపాటు సంధ్య ఒంటిమీది నగలన్నీ వెన్నెలచే దగదగలాడి పోతున్నయ్. అందమయిన ఆమె ఋూ

టముమీద చందమామ కాంతులు పడి ఆ లలాటమును ఒక బాలచంద్రుణ్ణిగా మార్చాయ్. కన్నీటిలో తేలాడుతున్న ఆమె సోగకన్నులు మంటలు కక్కుతున్నయ్. వసుు లిటువంటి స్త్రీరూపాన్ని ఎన్నడూ చూచి ఉండలేదు. అతడు మంత్రముగ్ధ దయిపోయాడు.

—'నేను పెళ్లిపీటలమీదినుంచి పారిపోయివచ్చాను, నీ విప్పుడా పెళ్లిపీటలమీదికి రావాలి. నాకీ రోజు సిగ్గు లేదు, ఎగ్గు లేదు, భయం లేదు, భక్తి లేదు, మానం లేదు, అవమానం లేదు, ఏమిన్నీ లేదు. నీవు తప్ప నాకిక 'నా' అనే వాళ్లెవళ్లూ లేరు. లే! ఇహ లేచిరా !'

'ఎక్కడికి రాను ?'

'ఏ పీటమీంచి ఇప్పు డెవడు లేచిపోయాడో ఆ పీటమీదికి.'

వసుుల హృదయం కలుక్కుమంది. జరిగిన సంగతి అతనికి తెలిసిపోయింది. ఏదో కలతమీద పెండ్లికొడుకుపక్షంవారు పెండ్లికొడుకును లేవదీసుకుపోయా రని అత డూహించుకొన్నాడు. హిందూసంఘంలో ఇట్టివి విరళాలు కావు కాబట్టి పరిత్యక్తమైపోయిన ఆ పెళ్లిపీట తనను ఆహ్వానించిం దని అతడు తెలుసుకున్నాడు. ఏలాగయినా నేడు పెళ్లి జరగాలనే కోరిక సంధ్య కుం దని అత డూహించాడు.

వసుుల తన మనస్సులో తా నిల్లా కష్టపడ్డా ఒరులను కష్టపెట్టజాలకపోయాడు. ఇంతేకాక స్నేహంతోటీ ప్రేమతోటీ ఇల్లా ముదలకించాడు. —'నీ యంతట నీ విల్లా ఇక్కడికి రావడం బాగులేదు సంధ్యా ! ఇటువంటి ఘట్టా లెన్నో వస్తూనేఉంటయ్. పరేకాని... మీ నాయనగారుగాని మరెవరుగాని ఇక్కడికి రాలేకపోయారా !'

‘మా నాయనగారా? ఆయన భయపడి ఎక్కడో దాంకున్నారు. మా అమ్మ చెర్లో పడ్డది. పదుగురూ పరిగెత్తి ఆమెను నీళ్లలోంచి దేవి ఒడ్డున పడేసి కడుపుమీద కాలేసి తొక్కి నీరు కక్కించి గదిలో పడేశారు. ఇటువంటి సమయంలో నేను నీ దగ్గరికి పరుగెత్తుకొని వచ్చాను. అయ్యో రామా! ఇల్లా అన్ని విధాలా చెడిపోవడం జగత్తులో ఎక్కడనయినా ఉందా? మేమిక ఎల్లా బతికేది?’’

ఈ చివరమాటలు వరుణులు మనస్సును మరోమారు తోడేసినయ్. అత డిల్లా అన్నాడు—‘సంధ్యా! నేనింత తక్కువకులపు బ్రాహ్మణికదా! నావల్ల మీ కులానికి ఏమి రక్షణం కలుగుతుంది? అయితే ఈ దేశంలో కులీనులు ‘కావలసినంతమంది ఉన్నారు. మీ నాయనగా రటువంటివారిని కలకడానికే ఊలోపుగా వెళ్లి ఉంటారు.’

సంధ్య ఏడ్చి—‘లేదు లేదు, ఆయన భయపడి పారిపోయాడు. నన్నెవరూ ఇక పరిగ్రహింపరు, నన్నెవరూ ఇక పెళ్లి చేసుకోరు. వరుణులూ! నీవే నన్ను ప్రేమించాలి,—చాలా కాలంగా వస్తూవున్న నా మానం కాపాడాలి’ అని అంది.

సంధ్య ఇల్లా తెగబడి మాట్లాడడం వరుణులకు కొంచెం కష్టమనే అనిపించింది. అత డామెచేతులు పుచ్చుకుని లేవదీయడానికి ప్రయత్నించాడు.

‘వద్దు వద్దు, నేను లేవను, నాకు శక్తి ఉన్నంతవరకూ ఇల్లాగే పడి ఉంటాను. ‘కులరక్షణం కలగదన్నావే, ఎవరి కులం? కులం ఎవరి కుంది? నేను బాపనపిల్లను కాను వరుణులూ నేను బాపనపిల్లను కాను. నేను మంగలిపిల్లను. అందులోకూడా నేను మంచి మంగలిదాన్ని కాను. నేను ముట్టుకున్న నీళ్లెవళ్లూ ముట్టుకోరు. నా నీళ్లెవళ్లూ తాగరు. ఓయ్ దేముడా నీ నాకీ శాస్తి ఎందుకు చేశావ్? నేను నీ కేమి అపరాధం చేశా?’ అని సంధ్య అంది.

వరుఘుంకు ఇదంతా వింతగా ఉంది. 'ఈమెకు పిచ్చి రొత్తలేదు కదా' అని అత డనుకున్నాడు. మెదడు వేడెక్కి పోయి ఇటువంటిమంటలు వస్తున్నయ్యని అతడు తలపోశాడు. 'ఇ వన్నీ జరిగి ఉండవ్,—సంధ్య ఇచటికి పారిపోయివచ్చింది,—ఇంట్లో పోట్లాడి ఉంటుంది' అని అత డను కుని సంధ్యను శాంతపరిచి మళ్లా ఇంటికి పంపివేద్దామని ఆలోచించుకున్నా డు. పిమ్మట వరుఘుఁు సంధ్య తలమీద చేయిపెట్టి మెల్లగా ఇల్లా అన్నా డు—'మంచిదికాని యిక పద. నిన్ను మీయింటికి తీసుకుపోతా.

సంధ్య అతని రెండు పాదాలూ పట్టుకుని లేచి—'పద! నీవు వస్తా వని నాకు తెలుసు. కాని నామాట లన్నీ విన్నాకే బయలుదేరు,—కాక పోతే నాకు మాత్రం ఏం తెలుసు, నీకుమాత్రం ఏం తెలుసు ?—నే నొక నాడు ని న్నేమన్నానో గుర్తుందా? 'కులం తక్కువవాడవు' అని అన్నా ను. ఆపాపమే ఇల్లా బద్దలయింది కాబోను, నేను బ్రాహ్మణపిల్లను కాక పోయాను. నే నిక ఎల్లా బతికేది వరుఘులూ ?'

సంధ్య మనస్సులోని యాతనాపరిమాణం వరుఘుఁు మనస్సును మళ్లా అనుమానంలోకి దింపింది. 'ఇదంతా యథార్థంగానే జరిగిందేమో', 'నిజ వృత్తాంతమే చెబుతూందేమో' అని అతడు తలపోసి మెల్లమెల్లగా— 'ఈ సంగతు లెవరు చెప్పారు ? నీ కెల్లా తెలిసెయ్ ? ఎవరు రుజూవు చేశారు?' అని ప్రశ్నించాడు.

'ఎవరా?, తాండవశాస్త్రి. ఆ? ఆయనే. ఆయన నాతో ఏ మన్నాడో తెలుసునా? తెలియదుకాబోను. పోనీలే. ఆ కథ అల్లా ఉం డనీ. కన్యాదానం చేయటానికి మా అమ్మ పీటమీద కూచుంది. మా నాయనమ్మ మాటాడకుండా నిలబడి చూస్తూంది. అప్పుడు పెళ్లిళ్ల పేరయ్య ఉన్నాడే మృత్యుంజయావధాన్లు, అతడు ఇద్దర్ని వెంటబెట్టుకుని వచ్చాడు. ఆ యిద్దరిలో ఒకడు మా నాయనమ్మను పిలిచి—'అక్కయ్యగారూ! మీరు మమ్మన్ని ఎరగరా?' అని అడిగాడు. రెండోవాడు మా అమ్మను చూపించి

మా నాయనమ్మతో—'నీవు నీ కొడుకుకు ఈ జగదంబను చేసుకుని ఈవిడె గారి కులం చెరిచావ్; ఇప్పుడు మళ్లా ఈ మనుమరాలి నిచ్చి ఈ కొత్త పెళ్లికొడుకుజాతిని చెరుస్తున్నావ్. ఇదేం పని?' అని మా నాయనగారిని వేలితో చూపుతూ అందరినీ పిలిచి—'ఏమండోయ్ మీ రందరూ వినండి! మీ రందరూ ఈ కాంతయ్యగారిని బ్రాహ్మణకులోత్తముడని అనుకుంటున్నారు. ఈయన బ్రాహ్మడు కాడు. మంగలి నాంచారిగాడి కొడుకు' అని చెప్పాడు.'

'ఏమిటిది? నీవు వాగడం లేదు కద! నీ కేమయినా వెర్రియెత్తలేదు కద!' అని వఝు లన్నాడు.

ఈ ప్రశ్న సంధ్యకు వినబడ్డట్లు లేదు. తా నిదివఱకటినుంచీ చెప్పు కుంటూ వస్తూవున్న ప్రసంగతంతువు నందుకుని మళ్లా ఇల్లా చెప్పటం మొదలుపెట్టింది—'అప్పుడు మృత్యుంజయుడు ఒక కుండనిండా గంగపోసి తెచ్చి మా నాయనమ్మముందు పెట్టి—'ఇ దంతా నిజమా అబద్ధమా? కాంతయ్య ముకుంద సోమయాజులకొడుకా మంగలి నాంచారిగాడి కొడుకా నిజం చెప్పు?' అని అడిగాడు. వఝులూ! అప్పుడు మా నాయనమ్మ తల వంచుకుని నిలువబడి ఉంది. ఆమె అబద్ధం చెప్పలేకపోయింది. ఆమె ఇల్లా అంది—'అయ్యా! ఇది సత్యం; ఇది భయంకరమయిన సత్యం. లోగడ మీ రనుకొంటున్నట్లు నేను సద్బ్రాహ్మణినీ కాను; ఈ బ్రాహ్మణ సంధ్య పిల్లా కాదు.'

వఝులకు అనుమానం కొంచెమయినా లేకుండాపోయింది. అతడు పిడుగుపడ్డట్టు నిలబడిపోయాడు.

సంధ్య మళ్లా ఇల్లా అందుకుంది—'వారిలో ఒక డప్పుడు జరిగిన ఘటన అంతా వివరించాడు. ఆ వివరించినవాడు మా నాయనమ్మగారి ఊరివాడు. వా డిల్లా చెప్పాడు: ఈ సోమమ్మగారి కెనిమిదేండ్లయీడున పెళ్లయింది. పెళ్లిఅయిన పధ్నాల్గు పదిహేనేళ్ల తరువాత ఒకడు వచ్చి—

'నేను మీ అల్లుణ్ణి, ముకుందసోమయాజులను' అని చెప్పి గృహంలో ప్రవేశించాడు. అత డట్లా రెన్నాళ్లుండి కొత్తబట్టలు కట్టుకుని అయిదురూపాయిలు తీసుకుని వెళ్లిపోయాడు.' అని చెప్పి సంధ్య 'ఓయి భగవంతుడా' అని అంది.

వర్ధులు నోట్లోంచి మాట రాక అలానే నిలబడిఉన్నాడు.

'ఏం చెప్పాను వర్ధులూ? ఆఁ ఆఁ గుర్తు వచ్చింది. అటుపిమ్మట అతడు తరుచుగా రావటం మొదలుపెట్టాడు. అప్పుడు మా నాయనమ్మ చాలా అందంగా ఉండేదిట. వాడు అటుపిమ్మట డబ్బు తీసుకునేవాడు కాదుట! ఇట్లా కొన్నాళ్లయాక వాడు పట్టుపడిపోయేసరికీ మా నాయన పుట్టాట్ట! ఔరా నేను తల్లినైయుంటే మెడవిరగదీసి పారేసి ఉండేదాన్ని. —ఏమన్నాను వర్ధులూ, ఏ మన్నాను?"

వర్ధు లస్ఫుటంగా ఇల్లా అన్నాడు '— పట్టుపడి' — 'ఆఁ ఆఁ పట్టుబడిపోయాడు. పట్టుపడిపోయి ఏం చెప్పాట్టంటే, — నాయంతట నే నీ పాడుపని చేయడంలేదు. మాకు ముకుందసోమయాజులుగారు దొరలు. వారి ఆజ్ఞానుసారంగా నేను చేస్తున్నాను. ఆయన వృద్ధు. అయిదారేళ్లనుంచీ పక్షవాతంతో తీసుకుంటున్నారు. కాబట్టి ఆ దొరవారు కొందరి పేరులు చెప్పి మమ్మన్ని అయా చోట్లకు పంపుతున్నాడు. మేము తీసుకుపోయే డబ్బులో వారికి సంగోరుపాలు. ఆ సోమయాజులుగారు మా కిల్లా చెప్పారు: బ్రాహ్మలపేర్లన్నీ వల్లించుకోండి! గోత్రాలు జాగ్రత్త! జంధ్యాలు తయారుచేసి అట్టిపెట్టుకోండి! నేను చెప్పిన చోట్లకు పోయి ఏడిపించి రూపాయలు తెండి. మీకు సగం నాకు సగం."

వర్ధులు ఇల్లా అన్నాడు—'అతగాడు ఇటువంటి పను లింకా చేశాడా యేమి?

సంధ్య ఇల్లా అన్నది—'ఆఁ ఇంకా పది పన్నెండు చోటుల్లో

ఇల్లాగే చేసి దినాదాయాన్ని ఎప్పటికప్పుడు తన దొరకు సమర్పిస్తున్నాట్ట! అత డింకేమి చెప్పాడో వింటావా? విను! 'ఈ వ్యవహారం మాకు సరి కొత్త కాదు, మా ముకుంద సోమయాజులుగా రొక్కరే యీ పని చేయ డంలేదు. చాలామంది బ్రాహ్మలు కోస్తాలో ఇదో వ్యాపారం సాగించి వాటాలు పంచుకుని ఒకరి సాయంచే మరొకరు డబ్బు పోగుచేసుకుంటు న్నారు' అని చెప్పాట్ట.

వరుఖలు క్రోధంచే గర్జించి ఇల్లా అన్నాడు—'ఇది వొత్తి దన డాని కింతమాత్రమూ వీల్లేదు. కాకపోతే బ్రాహ్మణకులంలో తాండవశాస్త్రి వంటి కసాయి ఎల్లా పుటతాడు? పైగా ఇటువంటివారే హిందూసమా జానికి తలకట్టు. సరేకాని, అటుపిమ్మట?

'పిమ్మట మా నాయనమ్మ ఆ పసిగుడ్డును తీసుకుని కాశీకి లేచి పోయింది. ఆనాటినుంచీ ఆమె సన్న్యాసిని అయిపోయింది. నాటినుంచీ తన మొహా న్నెవరికీ చూపించటం లే. ఆమె సంగతి ఇది. ఇహ ఆ నాం చారిగాట్ట ముకుందసోమయాజిని—'ఏమండీ ధొరగారూ! మాకు పుట్ట గతు లున్నయ్యా?' అని అడిగాట్ట! ఆ మొనగాడు—'ఆ పాపం నాది; దానికి పరలోకంలో నాది జవాబ్దారీ' అని అన్నాట్ట. నాంచారిగాడు— 'నా సంగతీ మీ సంగతీ అలా ఉండనీండి! పాపం, ఆ ఆడాళ్లగతి యేమి టండీ!' అని అడిగాట్ట! ఆ సోమయాజులుగారు నవ్వి—'వాళ్లందరూ నా పెళ్లాలుగాని, మీ పెళ్లాలు కారోయ్! ఆ భాగం మీ కెందుకు? ఎవరిని నేను నాకళ్లతో చూడలేదో, ఇహ చూడబోనో, అట్టివారికి గతు లుంటయ్యా ఉండవా అనే విషయం నాకుగాని మీకుగాని ఎందుకు? మన పనల్లా రొక్కం! రోజుకు ఎన్ని రూపాయలు వొచ్చెయ్యాలనేదే మన కావాలి. తతిమ్మాదానితో మనకు పని లేదు. చాలు పొమ్మ'న్నాట్ట! వరుఖ లూ! కథంతా ఇలా ఉంచటంవల్లనే కాబోలు ఒకనాడు మా నాయనమ్మ దగ్గర ఈ ప్రసంగం రాగా ఆవిడ—'జాతివల్ల నీచు డెవడో గొప్పవా

డెవడో ఆ సంగతి ఒక భగవంతునికే యెరుక. మనుష్యు లెవళ్లూ ఒకళ్లనొకళ్లు తక్కువవారని గోతపడకూడదు' అని అన్నది. ఆమెకడుపులో ఇంతున్నదని ఆనాడు నేను తెలుసుకోలేదు. సరేకాని చాలా పొద్దోతూంది, నన్నుగురించి నీ వెన్నడూ కష్టపడనక్కరలేదు కాని వఝులూ, నీ గొప్పతనమూ నీ త్యాగమూ నేను బతికుండగా మరిచిపోలేను' అని సంధ్య రెప్ప వాల్చక వఝులును చూస్తూ ఊరుకుంది.

'సరేకాని ఇప్పుడు నీతో నేను రాజాలను సంధ్యా' అని వఝులు సంకోచంతోటీ అనిశ్చితమైన స్వరంతోటీ అన్నాడు.

సంధ్య చకితయై—'ఎం చేత? నీవు నాతో రాకపోతే నాకు నిలవడానికి నీడేదీ? నే నెల్లా బతికేదీ? అని అన్నది.

అంతులేని ఈ ప్రశ్నకు సమాధానం చెప్పడానికి వఝులుకు ఆ తత్‌క్షణం ఎంత కొట్టుకున్నా శక్తం కాలే. కొంతిసేపయినాక మెల్లమెల్లగా —'ఇపుడు కొంచెం నన్ను క్షమించు సంధ్యా! తీరికగా నన్ను కొంచెం ఆలోచించుకోనీ' అని మెల్లిమెల్లగా అన్నాడు.

'ఆలోచించుకోవడమా?' అని తెల్లపోయి ఏకచూపుతో అతన్ని చూచి, ఆ అంధకారంలో అతని మొహం ఎంతవరకు చూడటానికి వీలవుతుందో అంతవరకూ చూడటానికి ప్రయత్నించి కాబోలు, అటుపిమ్మట ఒక దీర్ఘనిశ్వాసం విడిచి మెల్లమెల్లగా లేచి నుంచుని—'మంచిది, ఆలోచించు, అందుకు తీరిక కాసేపే కాదు, ఇహ బతికున్నంతవరకూ నీకు తీరికే. నేనున్నా ఇన్నాళ్లనుంచీ రాత్రనక పగలనక ఆలోచించుకుంటూనే వస్తున్నా. 'నా కంటె నీవు తక్కువ' అని నే నెన్నాళ్లనుకున్నానో అన్నాళ్లూ నే నిదే ఆలోచించా. నే దాలోచించటానికి మళ్లా నీవంతు వచ్చింది. మంచిది. వెళుతున్నా—' అని సంధ్య లేచి నిటారుగా నిలబడది. పాదవెన ఆమె చేలాంచలం జారి నేలమీద పడ్డది. ఆమె వెంటనే

దానితోపాటు వంగి తీసుకుని సద్దుకునేటప్పుడు తనను తాను చూచుకున్నది. ఆమె అపు డకస్మాత్తుగా కంపించిపోయి—'హా! భగవంతుడా! ఈ పెళ్లి చీర కట్టుకునేటప్పుడు, ఈ నగ లలంకరించుకునే టప్పుడూ, ఈ పసుపు రాచుకునే టప్పుడు ఇల్లా అవుతుం దని ఎవరికయినా తోచిందా?' అని పై కనబోగా ఆమెకంఠం బిగుసుకుంటూ వచ్చింది. అలా బిగుసుకుపోయే స్వరంతోనే—'ఇహ నాకు సెలవు వరహాలూ' అని సంధ్య మరోమారు నమస్కారం చేసి వెళిపోయింది.

వరహాలు నిశ్చలుండై నిలబడి ఉన్నాడు. కాని ఆ సంధ్య కనుచూపు మేర దాటిపోవంగానే అతని నిశ్చలత నీరైపోయింది. ఒరేయ్ సీతాయ్, ఒరేయ్ సీతాయ్, అని పిలుపుమీద పిలుపు, పిలుపుమీద పిలుపును, నవ్వు కరుకోసం వెచ్చపెట్టి, 'ఒరే నీ వామెను పంపి రారా, పంపి రారా' అని పలుకుతూ పలుకుతూ తానే ఉరుకులతో పరుగులతో సంధ్య ననుసరించాడు.

## ౧౩

ఎడమచేత దీపం పుచ్చుకున్నాడు, కుడిచేత్తో పెట్టెలో దేన్నో వెతుకుతున్నాడు, ఈలా వెతుకుతూ వెతుకుతూ వెలికి తీసిన వస్తువును ఒక గుడ్డపేలికలో కడుతూ కడుతూ ఉన్నాడు. ఇటువంటి కాంతారావు హఠాత్తుగా తన వెనకాతే—'నాన్నా' అనే పిలుపు విన్నాడు.

కాంతారావు బహుజాగర్తగానే చాలా రహస్యంగానే ఆ పని చేస్తున్నాడు కాబట్టి బెదిరిపోయి దీపం కింద పెట్టి లేచి నిలబడి 'ఎవరదీ సంధ్యా? ఇపుడే నేను వెళిపోతున్నానమ్మా,—ఇహ ఎంతో ఆలస్యం లేదు —అని అన్నాడు.

సంధ్య చాలా కష్టమ్మీద కన్నీళ్లాపుకుని — 'ఏం చేస్తున్నావ్ నాన్నా' అని అంది.

కాంతారావు తొకరా తిని,—'ఎబ్బే! ఏమీ లేదమ్మా! ఏదీ, ఏముందీ?' అని అన్నాడు.

సంధ్య అతని చేతిలో ఉన్న గుడ్డపేలిక చూపి—'అందులో ఏమిటి నాన్నా? ఏం కట్టావ్?' అని అడిగింది.

పట్టుపడిపోయినందువల్ల కాంతారావు చిన్నబుచ్చుకుని కొంత వినయస్వరంతో ఇల్లా అన్నాడు—'కాసికే—ఎక్కువ కాదమ్మా—రెమిడీలు కూడా తీసుకుపోతున్నా—ఇంకా అదిగో, ఆ మెటీరియా మెడికా—పెద్దది కాదు, మరి చిన్నది—చినిగి పోయింది, అట్టలుకూడా ఊడి పోయాయ్,—ఎన్నడూ ఎరగని చోటు,—ఏమయినాకానీ. కొంచెం ప్రాక్టీస్ చేసుకోవలసి ఉంది కదా! అందుకని ఇవి తీసుకుపోదామని అనుకుంటున్నా.'

'అమ్మ నిన్నిమాత్రమయినా తీసుకుపోవడానికొప్పుకోలేదా నాన్నా?'

కాంతారావు అనిశ్చితభావంతో తల ఊపి ఏమి తెలిపాడో సంధ్యకేమీ తెలియలేదు.

'నీ వెక్కడ ప్రాక్టీస్ పెటతావ్ నాన్నా?'

'బృందావనంలో. అక్కడికి ఎందరెందరో యాత్రికులు వస్తూ పోతూవుంటారుకదా. వారికేదో కొంచెం మందిస్తే నెలకు నాలుగయిదు రూపాయలయినా రావా సంధ్యా? ఆమాత్రం వస్తే నాకు చాల్లే. ఏమమ్మా?'

'తప్పక వస్తయ్ నాయనా తప్పక వస్తయ్. నాలుగయిదేం ఖర్మం నాన్నా చాలాచాలా వస్తయ్. అయితే నీ వక్కడ ఎవరినీ ఎరగవే! నాయనమ్మ చీకటితో కాశీ వెళ్లిందికదా; నీ వావిడతో ఎందుకు ప్రయాణం చెయ్యలేదు నాన్నా?'

‘అమ్మతోనా? కాశీకా? వెళ్లనమ్మా వెళ్లను. ఇహ నే నెవరి మెడకూ ఉరి పొయ్యను. నా వల్ల మీరందరూ కష్టాలపాలయ్యారు. ఇహ నే నెవరికీ కష్టం కలిగించనమ్మా. ఇహ బతికినంతవరకూ ఎవరికీ కష్టం లేకుండా బృందావనంలో పడివుంటా..

సంధ్య తండ్రికి దగ్గరగా వెళ్లి అతని చేతులు రెండూ పుచ్చుకుని—‘నాన్నా! నిన్ను నేనొంటరిగా విడిచిపెట్టలేను, నేనుకూడా నీతో వస్తా’ అని అంది.

కాంతారావు తన రెండుచేతులూ మెల్లమెల్లగా లాక్కుని కూతురు తలమీద కుడిచేయి పెట్టి—‘ఓసి పిచ్చిదానా! ఇదెల్లా కుదురుతుందమ్మా? నాతో ని వ్వెక్కడికని వస్తావమ్మా?—నీవు మీ అమ్మదగ్గర ఉండిపో. పాపం, అదికూడా చాలా కష్టా లనుభవించింది. నీవు ఇక్కడుండి, మందుకోసం నా దగ్గిర కొచ్చేవారికి రెండు ఉండలు వేస్తూ ఉండమ్మా. ఇంకో మాట ఉంది సంధ్యా! మీ అమ్మగనుక ఒప్పుకుంటే నా పుస్తకాలు విస్సన్నకియ్యి. పాపం, అతను గొప్పదరిద్రుడు. పుస్తకాలు కొనుక్కోలేడు. కొనుక్కోలేకపోవడాన్నే అతనికి వైద్యం అబ్బింది కాదు.’ అని అన్నాడు.

సంధ్య తల తిప్పి—‘కాదు నాన్నా! నేను నీ వెంట రాక తప్పదు. ఇదుగో నామూట!’ అని తుండుగుడ్డలో కట్టిన రెండుకోకలు గల ఒక చిన్న మూట ఎత్తి అతనికి చూపింది.

కాంతారా వేనాడూ ప్రతి చెప్పి ఎరగడు. అతడు రాజీపడి ‘మంచిది నడు! ఇదుగో మీ అమ్మ నీకోసం చాలా దుఃఖిస్తుంది సుమీ!’ అని అన్నాడు.

తనవారనీ పరాయిలనీ లేక అందరిముందరా నిన్న తన తండ్రి పొందిన దుర్గతిని సంధ్య చూచింది. అది జగదంబ సొంతయిల్లు కాబట్టి యింత సందరగోళమూ జరగడానికి వీ లయింది. కాని ఈ యవమానం సంధ్య

యొముక యొముకకూ పట్టిపోయింది. అందువల్ల తల్లిమాట యేమీ యెత్తక తండ్రికి ప్రత్యుత్తరంగా మాటిమాటికీ తల తిప్పి 'కాదు నాన్నా! నే నిక్కడ ఉండేదే లేదు, నీతో వచ్చేదే నిజం. నేను నీవెంట ఉండకపోతే నిన్ను చూసేవాళ్లెవళ్లు నాన్నా? నీ కెవ రన్నం వండి పెడతారు?' అని అన్నది. ఇల్లా అని సంధ్య తండ్రి మందులూ పుస్తకాలూ మూట కట్టేసి చేయుచ్చుగుని 'వెళదాం లే నాన్నా! మనం తొందరగానే ప్రయాణం కట్టేశాం. లేకుంటే మనకీ పన్నెండుగంటల బండి అందేది కాదు' అని అంది. గడియ బిగించుకుని జగదంబ ఒక గదిలో కూచునివుంది. సంధ్య ఆ గదిగుమ్మంమ్ముందు సాష్టాంగపడి 'అమ్మా మేం వెళ్లిపోతున్నాం. రెండు కోకలు తప్ప నీ వస్తువు లేవీ నేను తీసుకుపోవటం లేదు' అని అనేసి ఆ పళంగా ఏడ్చింది. లోపలినించి మాత్రం ప్రత్యుత్తర మేమీ రాలేదు. సంధ్య వెంటనే కళ్లు తుడుచుకుని—'అమ్మా! అపకీర్తితోనూ నిందతోనూ తయారుచేసిన సిరాయావత్తూ మొగమంతా మెత్తుకొనే మేము సెలవుచ్చుకుంటున్నాం—మీ సంఘంలో ఇందునుగురించి విచారణ యేమీ జరగదు, —కాని ఎవరి మహాపాతకభారం నెత్తిని మోసుకుని మాకు లేచి పోవలసి వచ్చిందో వారిని విచారించడానికయినా ఆఖరికి ఒక్కడు ఉన్నాడనే సంగతి నీకు తెలిసివస్తుంది లే' అని అన్నది.

గది లోపలిభాగం వెనుకటల్లేనే స్తంభించుకుని వుంది. తలుపులు వెనుకటల్లేనే మూసుకుని ఉన్నయ్. తండ్రి ముందు దారి తీయగా సంధ్య వెనువెనుకనే బయలుదేరి వెళ్లింది. దాపున ఉన్న ఒకచెట్టు నీడలో ఎవరో నిలబడి ఉన్నారు. కాంతారావు ఆ చెట్టును సమీపించాడు. వెన్నెట్లో ఆ నిలుచున్నత నెవరో కాంతారావుకు తెలిసిపోయింది. 'వరులా యేమిటి?' అని పలకరించాడు.

'ఆఁ. అవును. మీ రీ పన్నెండుగంటల బండికి వెళతా రని విని చూడ వచ్చాను.'

'ఆఁ. చూచావా ఖర్మం. నన్ను పట్టుకుని మా అమ్మాయి వొదిలి పెట్టలేదు. నే నెక్కడికి పోతానో ఎక్కడ ఉంటానో ఏమిటో! దీని వెర్రి యేమిటో కొంచెం ఆలోచించు!'

వరహాలుకు నోట్లోంచి మాట రాలేదు. కొంత సేపటికి 'నీవూ వెడతావా సంధ్యా?' అని అన్నాడు.

'ఆఁ' అని మాత్రం అని సంధ్య ఊరుకుంది.

వరహాలొకటి రెండు నిమిషా లూరుకుని సంకోచంతో ఇలా అన్నాడు—'ఆనాడు రాత్రి నా మనస్సు నేలాగూ స్థిరంచేసుకోలేక పోయాను గాని ఈనాడు స్థిరంచేసుకున్నాను. నీమాటలు నాకు సమ్మతాలు సంధ్యా!'

ఏమీ తెలియక కాంతారావు కళ్లుపెట్టుకుని చూస్తూవున్నాడు. సంధ్య శాంతమైన కంఠంతో మెలమెల్లగా ఇల్లా అన్నది—'ఆనాడు నేను కూడా కిందట్లు మీ దట్టయిపోయాను వరహాలూ! కాని ఈనాడు నా మనస్సుకూడా స్థైర్యం చిక్కింది. 'ఆడవాండ్లను పెండ్లిచేసుకోడమే పనా లేక వేరేమయినా పను లున్నాయా?' అనే విషయం తెలుసుకోడానికే నే నిప్పుడు నాయనగారితో వెళిపోతున్నాను. ఇహ మాట్లాడడాని కవకాశం చాలదు వరహాలూ! నీకు శక్తిగనుక ఉంటే క్షమించు!'

సంధ్య ఇల్లా అని తండ్రి చేయిపుచ్చుకుని ముందు దారి తీసింది. వరహాలు వారి వెనువెనుక రెండుమూడడుగులు వేయుంగానే సంధ్య వెనక్కి తిరిగి, 'వరహాలూ! మాతో నీ వెందుగ్గాని నీ వింటికి పో' అని అంది.

'ఈ కష్టకాలంలో నీవు మీ అమ్మను విడిచిపెట్టి పోతావా సంధ్యా?'

'ఏం చేయను వఝులూ? నా కింతటివరకూ తల్లిదండ్రుల నిద్దరినీ సేవించే సౌభాగ్యం కలిగింది కాని ఇప్పు డొకరిని విడిచిపెట్టడం తప్పనిసరి అయింది. నేను విడిచిపెట్టినా ఆవిడె కో ఉపాయం ఉందనుకుంటా. నిన్న తమాషా చూడటానికి మా యింటికి చాలామంది విజయంచేశారు. వారిలో కొంద రిందుకు ప్రాయశ్చిత్తం ఉందని చెప్పారు. ఉంటే మంచిదే. అప్పు డామెను కనిపెట్టుకుని ఉండేవారు కావలసినంతమంది ఉంటారు. కాని మా నాయనను కనిపెట్టుకుని ఉండగలవా రీ ప్రపంచకంలో నేను తప్ప మరి ఎవరున్నారు? ఇహ సంచోకు నాన్నా పద!'

సంధ్య ముందు నడవగా కాంతారావు వెనుక వెళ్ళాడు వఝు లచటనే స్తంభించిపోయాడు.

వా ళ్ళిద్దరూ కొంత ముందుకుపోయేసరికీ కొంతమంది 'వంకాయకూర ఎంత బాగుంది, పనసకాయ ఏమి పాకానపడ్డది, ల డ్లిటువంటి వెక్కడా తినలేదు' అనే ప్రశంసావాక్యాలతో దారినంతా గలగల లాడిస్తూ తబరి లంకచుట్టలు కాల్చుకుంటూ ఇళ్లకు పోతున్నారు. వాళ్ల ఆనందమూ తృప్తీ ఆగేట్టు కనబడడం లేదు. వెన్నెలవెలుగులో వా రందరూ తమను కనిపెటతా రేమో అనే భయంతో సంధ్య తండ్రి చే యిచ్చుకుని పైదొలగి నిలుచుని వాళ్లు వెళ్లిపోంగానే మళ్లా నడిచిపోవడం మొదలుపెట్టింది.

సందు తిరగంగానే ఈ భూరిభోజనానికి హేతువేమిటో తెలిసింది. పక్కనున్న మావిడితోటలోనుంచి తాండవశాస్త్రి యింటిముంగల కాగడాల వెలుగున్నూ కలకల ధ్వనియున్నూ గోచరమవుతూంది. 'ఇక్కడ పచ్చడి, అక్కడ నెయ్యి, కూరలు, భక్ష్యాలు' అని పలుతెగల కంఠాల నుంచి బయలుదేరుతూవున్న ధ్వనులతో ఆ ప్రదేశమంతా ముఖరితమయి పోతూంది.

కాంతారా విల్లా అన్నాడు—తాండవశాస్త్రిగారి యింట్లో ఇవ్వాళ బూజబ్బంతి కాదూ. సమయం వచ్చినప్పుడు విందులు మహాబాగా చేస్తాడాయన. అయిదారూళ్లు పిలిచివచ్చాడని చెప్పుకోగా విన్నాను. బ్రాహ్మణులూ శూద్రులనూ ఎవరినీ విడిచిపెట్టలేదట.'

సంధ్య ఆశ్చర్యపడి 'ఇప్పుడు బూజపుబంతేమిటి నాన్నా?' అని అడిగింది.

'అదేమిటి? సత్యనారాయణావధాన్ల కూతుర్ని తాండవశాస్త్రులు చేసుకున్నాడు. నిన్న లగ్న మయింది.'

సంధ్య నోట్లోంచి కేవలమూ ఈమాటలే బయటికొచ్చేయ్—'హారిమతినా? బువ్వాపు బంతా?'

'ఆఁ ఆఁ హారిమతే కావున్న పేరు. పాపం, ఏమీలేని బ్రాహ్మడు! బతికిపోయాడు,—పిల్ల కట్టుకిప్పి—కాదంటే అమ్మా? ఏమిటది అల్లా చూస్తావ్?'

'ఎబ్బే ఏమీ లేదు నాన్నా. పద పద. మనం తొందరగా వెళ్లాలి.' అని సంధ్య తండ్రి చేయుచ్చుకుని ఇంచుమించు లాక్కుంటూ రైలుస్టేషనుకు అభిముఖంగా నడిచింది.

... ... ...

తండ్రితో సహా సంధ్య స్టేషనులో ప్రవేశించింది. రైలు రావడానికింకా అరగంట ఆలస్యముంది. పల్లెటూరి రైలుస్టేషను; పైగా రాత్రి. కాబట్టి బాటసారు లెందరో లేరు. ప్లాట్‌ఫారం చివర గన్నేరుచెట్ల దట్టపు నీడలో ఎవరో కూచునివుంది. ఆవిడె వీళ్ల నిద్దరినీ చూడంగానే తొందరపడి పయటతో ముఖం కప్పేసుకుంది.

కాంతారావు ఆమె కనభిముఖంగా నిలుచున్నాడు. కాని వాడి యయిన సంధ్య చూపును మాత్రం ఆమె మోసగింపజాలకపోయింది. సంధ్య ఒక్క నిమిషం ఆచిచూచి, నివ్వెఱపడి — 'మీనాక్షప్పయ్యగారూ! మీ రెక్కడున్నా రేమిటి? ఒంటరిగా?' అని అన్నది.

సంధ్య సరిగ్గా తనను గుర్తించిందనుకుని మీనాక్షి వెంటనే రెండు చేతులూ జాపి సంధ్యను కౌగలించుకుని ఆవురుమంది. సంధ్య పొందిన విస్మయాని కంతులేకుండాపోయింది. సంధ్య తనకు కలిగిన దౌర్భాగ్యానికే కుళ్లిపోతూంది. ఇంతలోనే తనయింటిపక్కనే ఇంకో దురదృష్టవంతురాలి కర్మం ఈ రీతిగా కాలిపోయిందని సంధ్య కేమాత్రమూ తెలియదు. కాని కాంతారా వొక్కసారిగా కిందట్టు మీదట్టు క్రిష్టంథిక్టై కూచున్నాడు.

'మీ రేవూరు వెళుతున్నారు మీనాక్షప్పయ్యగారూ?' అని సంధ్య అడిగింది.

బిగుసుకుపోయిన మీనాక్షి గొంతుకలోనుంచి మరి మాట రాలేదు. 'ఎక్కడికి వెళ్లాలో ఏమిటో ఆ ఊహ ఆమె కేమాత్రమూ లేనట్లు తల తిప్పి ఊరుకుంది.

అటుపిమ్మట ఎవరుగానీ ఏమీ మాటాడలేదు. రెలు వచ్చే వేళ దగ్గరికి వచ్చింది. టికెట్లు కొనాలి. కాబట్టి మాటాడ్డానికి ప్రయత్నించి ప్రయత్నించి తుట్టతుదకు కాంతారావు—'నీ వెక్కడికి పోతావు మీనాక్షీ? టికెట్టు కొన్నావా? అని అడిగాడు.

మీనాక్షి మునపటిలాగానే తల ఆడించి 'లేదు' అని అన్నది. ఆమె కళ్లల్లోంచి కన్నీ ళ్లూరుతున్నయ్. 'తమ రెక్కడికి వెళుతున్నారు?' అని ఆమె గద్గదస్వరంతో అడిగింది.

'బృందావనం'

'సంధ్యకూడా మీతో వస్తుందా?'

'ఆఁ. వస్తుంది.'

కొంగుముడి మెల్లిమెల్లిగా విప్పి కొన్ని రూపాయలు తీసి కాంతారావు పాదాలముందు పెట్టి మీనాక్షి—'టికెట్టుకు ఎంతవుతుందో నే నెరగను. నావద్ద యాభై రూపాయలుమాత్రం ఉన్నయ్,—ఈ రూపాయలు మీదగ్గిర ఉంచుకుని నాక్కూడా బృందావనానికి ఒక టిక్కెట్టు కొని పెట్టండి. బృందావనానికిమాత్రం నన్ను జేరేస్తే చాలు; ఆపైని నా కీ లోకంలో ఇంత కెక్కువ ఎవరినీ ఏమీ కోరేదుండదు' అని అన్నది.

కాంతారావు క్షణకాలం ఊరుకుని తుదకు మెలమెల్లగా ఈలా అన్నాడు—'మంచిది మాతోటే రామ్మా!'

Printed at PRAJAMITRA Press Royapettah—Madras.

## శ్రీ శాస్త్రిగారి

## ఇతర పుస్తకాలు:

| | రు. | అ. |
|---|---|---|
| రాముని బుద్ధిమంతనం | 0- | 6 |
| తీరని కోరికలు | 0- | 6 |
| సర్వేసు వీలునామా | 0- | 6 |
| గాంధిగారి ఆత్మకథ-౧ | 1- | 0 |
| ,, ,, -౨ | 0- | 12 |

★ వేలూరి శివరామశాస్త్రి,

సూరవరం – గన్నవరం టపా

[కృష్ణా జిల్లా.]

బాపన పిల్ల

శ్రీ శరచ్ఛంద్రకృతి

వేలూరి శివరామశాస్త్రి

అనువాదము